# అధ్యాత్మ రామాయణకీర్తనలు

శ్రీ సుబ్రహ్మణ్య కవి కృతము







పబ్లిషర్సు

కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

వెల రు 1—0—0

# రామాయణకీర్తనలు

సుబ్రహ్మణ్యకవికృతము

అయినాపురపు సోమేశ్వరరాయ కవిచేఁ

బరిష్కృతము





పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1954

[వెల 1—0—0

శ్రీరస్తు

# శ్రీమదధ్యాత్మ రామాయణ కీర్తనలు

## బాలకాండము

### 1 ధన్యాసి—ఆదితాళము

పల్లవి—నమశ్శివాయ తే నమోభవాయ॥

అనుపల్లవి—సమానాధికరహితాయ శాన్తాయ స్వప్రకాశాయ - ప్రమోదపూర్ణాయ, భక్తౌఘ పాలనాయ ॥నమ॥

గర్వితదానవలోక, ఖణ్డనాయ శ్రీరజత - పర్వతాగ్రనిలయాయ పావనాయ-సర్వలోకపాపపుంజ, నిర్వాపణాయశర్వాయ - దర్వీకరభూషణాయ, సర్వోత్తమాయ ॥నమ॥

అణ్డజాధిపవాహనాయ కాణ్డాయమేరుశైలకో - దణ్డాయ శితి కంఠాయ పండితాయ - మండితత్రిపురజయో, ద్దండతాండవాయ బ్రహ్మాండనిలయాయ మహా, మాయాతీతాయ ॥నమ॥ 2

మందహాసవదనార, విందసుందరాయ యోగి - బృందానంద దాయ శత్రు భీకరాయ - ఇందుసూర్యాగ్ని నేత్రాయ, వందితప్ర మథగణాయ - నందివాహనాయపోషిత, బృందారకాయ ॥నమ॥ 3

నిరుపమానందఘన, నిశ్చితాయ శాశ్వతాయ - వరదా భయంకరణాయ, గిరిశాయ - తరుణేన్దు శేఖరాయ, పరమపురు షాయ భవ - హరణాయ శ్రీకాళ, హస్తీశ్వరాయ ॥నమ॥ 4

గంగాభంగతరంగ సంగతజటాజూటాయ - సంగీతలోలాయ శుభ, సంగతాయ - అంగజాన్తరంగమద. భంగాయస్ఫటికోప - మాంగాయ శేషశైలాధీశమిత్రాయ ॥నమ॥ 5

2 రేగుప్తి—అటతాళము

పల్లవి—ఈసంశయమువారింపవే పర, మేశ నన్నుమన్నింపవే॥

అను—శ్రీసదాశివ ప్రశ్న, జేసెద వివరింపు - వాసుదేవతత్త్వము,
మహత్త్వము - భాసమానవిలాస నేనిదెనీసత్కృపావలోక
నమున - నీసమయమున దెలియవలసినదే సమస్తమిదే
ప్రశస్తము ॥ఈసంశ॥

జ్ఞానవిజ్ఞాననిశ్చలభక్తివైరా, గ్యానందములకు నిధానమైన విన్నశ్రీనిలయమై వెన్నవలె మృదువై యస, మానమైనుతిగన్న, మార్గమువిన్న-దైన బహుగోప్యతరమైన య, సూనముగ సెలవిమ్ము చంచలలేనితంబినులకు నేసీదానదానవవైరి మ్రొక్కెద ॥ఈసంశ॥ 1

వారిజాక్ష జగదాధారమూర్తియైన, శ్రీరామునియందు సార సద్భక్తి - నారూఢమై ముక్తికారణమై యల, రారు నొక్కయుక్తి నాదిశక్తి - మీరరసిద్ధీరరసికాళికి, సారకళలూర బలుకుముభవ - నీరధికి తారకము భక్తి, మీర సుజనులను వేతె లేరని ॥ఈసంశ॥ 2

దేవ శ్రీరాముని దేవదేవుగా వ, ద్భావాతీతుని గోసుధీవరులెల్ల - భావము రంజిల్ల బల్కుదురతని, భావింతు రదియెల్ల గల్ల గాదె - గావునను శ్రీవిభుడు ముక్తికి, కేవలము తానలమైనను - శ్రీవెలయుభూవలయమున తను, భావుడై జీవుడైన దేమి ॥ఈసంశ॥ 3

మాయావృతుడై రామస్వామి సన్ముక్తి దాయకుని గనుతను దా దెలియలేడు - వేయేల నతడు జూడు, ఆత్మను తత్త్వవేత్తల కేనేదు దెలిపినాడు - మాయికుడటందు రాకకొందఱ దేయథార్థము

సేయ - సుజన - ధ్యేయు డెటులగునైన జానకి, కామెడల దా నడల నేటికి ॥ ఈసంశయ॥

ఈవాక్యముల కర్థమీవుగా కితరులు, భావించి పలుక నేర్పరు లెవరులేరు - దేవుడవై చెలువుమీరునన్ను జేరు, ధీరాత్ములుగోరు కోర్కెలీడేరు - ఈవసుధ శేషశైలాధిపుడై వెలుగురాఘువుచరితము సు-ధావర్షమై చెవులుపండువుగావించు సేవించుజనులకు ॥ ఈసంశయ॥ 5

3 భైరవి—అటతాళము

పల్లవి—వినవే సత్యవాణీ శర్వాణీ అలి, వేణీ నీరజపాణీ॥

అను—ననుగోరి భజియించి, నను మదిలోనుంచి - నను వరదుడ
నాడు, సంశయములేదు - మునుపు ఇటులిదియడుగ రెవ్వరును
మహాయోగివరసంభా - వనము జీవనమృతసే, వనము,
జన్మపావనము ॥వినవే॥

శ్రీరామునకు నమస్కారము జేసి యని - వారణనాత్మ, త త్వము నీకు వివరింతు - నారాఘువుడు శౌరి, యజ్ఞానహారిజ - తారి శ్రీవిహారి, మాయాధారి - తారకకీర్తి, సత్యజ్ఞానస్ఫూర్తివి - దారి తార్తి దేవ, తాచక్రవర్తి చిదానందమూర్తి - వైరాజిలు శ్రీహరి మాయకెల్లనా - ధారమైనందునల్ల, మోహాము కల్ల శౌరి ప్రకృతికి నాదినిజమా, యూరూఢిజగములు సృజియించి య - నారతము నభ ముగతి వెలిలోను, పూర్ణానుబూసు ॥విన॥

వితతమాయచే, నిర్మితమైన జగము వి - స్మృతిసూచిచుంబిత, శిలచే బరిణమించు - గతియె కర్తృత్వము, అతనికిలేదు దు - ర్మతు లెఱుగరీదారి, కోర్కులుమీరి - మహీహీనులైరియే, మనవచ్చువారి సం-సృతియె కోరియుందు, చేబద్ధులైరి కూమధుకైటభారి - అతిశుద్ధ చిద్ఘనుడని తెలియుజ్ఞాన - మతనికిగలదందుకు, భువిలో గొందఱు

తపతనుద్యుతి లసన్మాలిక, నుతగణాన్వితమయ్యు మఱచిన-గతి మన స్థితుడౌ జగద్గురుని, ఖలు లెఱుంగరని ॥విన॥

అకటా సూర్యునియందు, నప్రకాశత్వము-యొకనాటికైనను యున్న దేయటువలెనే - ప్రకటమైజ్యోతిస్స్వ-భావమాత్మునియందు పనిలేను మాయవాడు - నీవికమీదు - అకలంకగనవే. నిత్యము నమ్మిమనవే ర - తుకుడనవే శేష - శైలేశుగనవే భక్తియుచేకొనవే - అకుటిలునకు చాంచల్యము చెప్పుటలు చలదృ - ష్టికిచూడనునికిపట్టుభ్రాంతమైనట్లు-సకల కాలమును ప్రభమా, లికిపగల్రాత్రిలేనటులా-త్మకును జ్ఞానాజ్ఞానములు రెండు లేనివైయుండు ॥విన॥

### 4 కేదారగౌళ—ఆదితాళము

పల్లవి—సీతారామమారుతి సంవాదము, చేరివినవే శ్రీదము॥

అనుపల్లవి—శీతాంశుముఖియో, చరితమునందలి - చాతుర్యము చూడుసంశయముపీడు - ఖ్యాతిగ మునుదశ, కంఠుని రవికుల జాతుడై నరఘురాముడుసబల - వ్రాతముగనుజంపి, సాప్తుడై సా, కేతపురిజేరియు, న్నతఱిని నడచిన ॥సీతా॥

హాటక సింహాసనమున రాముడు కోటిసూర్య సమకాంతిని వెలుగుచు - పాటలాధరిధరాసుతతోడను, పరగవసిష్ఠాదిగురు బుధమిత్రకోటిసేవింప నాదినారాయణుడౌ, మేటిభక్తానుమోది కమలా వినోది - దీటు లేకకొలువుండి హనుమంతుమనసు, దెలిసి సీతను బలుకుమన ముద్దుగులుక - మాటిభక్తజనాగ్రణి కృతమతి, సాటి లేని శౌర్యధైర్యఘనుడును మేటియైనయనిల సూనుగనుగొని తేటముగను లోకవిమోహినిబలికెను ॥సీతా॥

రాముడు పరమానందమయుడు, సర్వచరాచరపరిపూర్ణుడవ్యయుడు - సామగానలోలుడచలుడాద్యుడు, సర్వసాక్షిసుమ్ము ఘనిర్ముక్తకాముడిదినిము, పరమాత్ముడనుచు వేమారుదెలసికొమ్ము

భక్తులసామ్మ్మ - సామిారీసంశయమెల్లను బోజిమ్మ, నామాట మది నమ్మ్మ, ధీనిధివిగమ్మ - యేమనవలె నేమూలప్రకృతిని, యీమహాత్మ్మని సన్నిధానమాత్రను - ఈమహాద్భుతము లొనర్చుమూఢులు స్వామియందు నారోపణసేయుదురనె ॥సీతా॥ 2

ఈకోసలపురిలో రాముడై దశరథునకు నితడు బుట్టుటయు విశ్వామిత్రుయాగము - సాకల్యముసేయుటయు నహల్యకు శాపము బాపుటయు విలువిఱచినన్ను - చేకొని చెలగుటయు పరశురాముని డాకయడంచుటయు, బురిజేరుటయు - కైకపనుప దండకాటవి కేగుట- ప్రాకటమాయాసీతాహృతియందుచిత-శ్రీకరవిసుతు జేరి వాలినటు జేరి వారధిగట్టి రావణుని-భీకరాజిదునిమి నన్నుగైకొని సాకేతము జేరుటెల్ల మత్కృతియనె ॥సీతా॥ 3

ఆరాఘవునియం దీవిధమజ్ఞానులారోపణసేయుదురు మధుకైట - భారినిర్వికారు డఖిలాత్మకుడు, పరిణామరహితుడు బ్రహ్మయితడు - సూరిబృందసుత్యుడు ఆనందయుతుడు భూరిభువనహితుడు, సకలసమ్మతుడు - కారుణ్యానైర్ఘృణ్య, హేయోపాధేయ సుఖదుఃఖ, గమనాగమనాది ద్వంద్వములులేవి - శ్రీరమణీయున కీవిభు నెఱిగిన వాగిజేర వెఱచిమాయ పరువిడు - దారితారి శేషశైలశిఖరవిహారి జేరి కడతేరుదారియిది ॥సీతా॥

5 సావేరి—ఆదితాళము

పల్లవి—వినుమని శ్రీరాముడు తాబలికెను, విశదముగను జేరి॥

అను—జనకజచే విన్న యనిలజునికి జ్ఞాన - జనకమానట్లుగాను మోదముతోను॥

సమతను ఆత్మానాత్మపరాత్మలజాడలు త్రివిధములు పవనజ సుమతాహంకారకర్తృత్వములన, మరినయది యాత్మ-రమణననృత

జడదుఃఖములను నీ, రసనుయినది యనాత్మ, నిత్యము - విమలము
సత్యజ్ఞానానందా, త్మకమిదియె పరాత్మ, మహాత్మా ॥విను॥ 1

ఆకాశము త్రివిధంబయినట్లు ప, రాత్మ త్రివిధమాయె, దెలి
యగ - నైకముగాను పరాకారము జ, లాశయబింబితమైన-చేకొని
రదవచ్ఛిన్నాకాశము, చెలగిభిత్తియందు, నెంతయు - బ్రాకటముగ
నిటు ప్రతిబింబితమై, ప్రబలినదీచాయ, శ్రీయాంజనేయ విను॥ 2

చాతురిమీరి నఖండాద్వితీయ, చైతన్యమువలన, బింబభూ
తుపై త్రివిధాహంకారవిరా, ట్పురుషుడుజూపట్టె - అతనియందా
భాసరూపమయి, భూతేంద్రియమనో, వృతమయి - ఖ్యాతిగాంచి
జీవాత్మయనదనరె, గనుగొనుమీజాడ, క్రమముతోడ ॥విను॥ 3

గుణమయమాయకర్తృత్వము పొసంగి, నజీవత్వాదిమలిన
ములుగణుతింపనవిచ్ఛిన్నమైనయవి కారపరాత్మ,యందు-అనయము
సనునారోపణసేయుదు, రజ్ఞానులుభువిలో, నెఱుగక-అనిశముశుక్తి
రజతమని భ్రమయుటే. యాభాసమనదగుచు, దెలియనగును ॥విను॥

చెలగు నవిచ్ఛిన్నతబ్రహ్మము, విచ్ఛేదము కల్పితము, గావున
నలభిన్ననకు పూర్ణాత్మకునైక్యము, వలననుజనులచే, అలఘుతత్వ
మస్యాదిమహావా, క్యములచే బ్రకటమై, యలరెడు - వెలయగ
నైక్యజ్ఞానము గల్గిన, విద్యమాయమూను, గుణములతోను ॥విను॥ 5

పావనులై యీక్రమ మెఱిగినమ, ద్భక్తులు మత్పరము,
జెందుదు-రీవసుధను భక్తివిహీనులుగ, గర్వితులై, దుర్మతులై! కేవల
మును శాస్త్రగర్తములబడి, కెరలి భవశతములు, నొందుచుభావము
చెడి సుజ్ఞానదూరులయి, పోవుటనిశ్చయము, నీకేమిభయము॥విను॥ 6

పరమమైనయీయుపదేశము గో, ప్య మిది భక్తిలేనివారి -
కరయు నింద్రరా, జ్య మొసంగిన నియ్యకు మిది, భవహరము-గరిమ

నఖిలవేదాంతసారసం, గ్రహము శుభావహము, కనుగొను - చిరు
శేషాచలఖరనివా, సుండనై భువిలోను, వెలసినాను ॥విను॥ 7

6 కాంభోజి—ఆదితాళము

పల్లవి—నే ధన్యనైతి నే జగత్ప్రభో, సాధులోకవిభో॥
అను—మాధవ చరణారవింద, మకరందము గ్రోల గల్గెనే ॥ధన్య॥
మునుమిడి సంశయమునే, ముడి వీడె నీయనుగ్రహ - మున
రామతత్త్వముసంక్షేప, ముగవింటి కడదేరగంటి - మనసు
తనివి దీరదాయె - మన్నింపవే దైవరాయ, అనువంద నిను
జేర మాయ యతిదూరమై తొలగిపోయెనే ॥ధన్య॥

అద్వితీయాఖండపరిపూర్ణానంద వారిధిలోన - చిద్విలాసో
ల్లాసివైరం, జిల్లజేసి నన్ను డాసి - హృద్వికాస మొసరించి, హిత
వాక్యము లుపదేశించుటచే - విద్వన్నుత శంకర వి, శ్వేశశంభో
మహాదేవ నే ॥ధన్య॥

స్వామీ నేనీదేవిన్న యీచరితము నవరసభరితము, వేమా
ఱుదీని విన బల్కు, వీను లమృతముజిల్కు, శ్రీమహిళాభి రాము
డై శేషాద్రిధాముడైన శ్రీరాముని దేవతాసార్వ భౌముని నీవలన
దెలిసినే ॥ధన్య॥

7 గౌళిపంతు—ఆదితాళము

పల్లవి—వినుము ధరాధరవరతనయా ధృత, వినయా సరసగుణాభి
నయా॥
అను—చనువుమీఱ నన్నడిగిన యీశుభ, చరితము హతదురితము
యిది నిరతము ॥విను॥

రావణాదిదుష్టాసురకోటుల, మోవలేక ధరత వేడితదైభూ -
దేవి విమల గోరూపము గైకొని, శ్రీవిలసిలు బ్రహ్మలోకమునకు-శీఘ్ర
మేగి విరించిచరణరా, జీవము లశ్రుకణమ్ములదడుపుచు - సావధాన
ముగ మ్రొక్కి వినతయై, తావచ్చుట వినిపించెవిశదముగ ॥విను॥ 1

వనజభవుం డొకముహూర్తమాత్రము, మనమున నంతయు నూహచేసిక్రొ - న్ననవిల్తునితండ్రిని గనుగొనుటకు, మునుసురపరివృతుడై భూసహితము - గను చని క్షీరసముద్రతీరమున, ననుపమ, భక్తివినమ్రుడై హరిని - వినుతించెను వేదాంతవాక్యముల ఘన వినయానందములు పురిగొన ॥విను॥ 2

కోటిసహస్రాంశు సమప్రభచే, మాటికి దిక్కులు తేజము సేయుచు - హాటకాంబరము కటిపై వెలుగ కి, రీటహార కేయూర కాంతులు ల - లాటకంఠ బాహువులను దనరగ, మేటికౌస్తుభశ్రీవత్సములకు - నాటపట్టయి చతుర్భుజుడగుచుని, శాటవైరి గనుపట్టు మోదమున ॥విను॥ 4

గరుడవాహనారూఢుడు కమలా, ధరణీయువతీయుగళయుతుడుశం - ఖరథాంగగదాపద్మవిరాజితు డురుతరవనమాలికాభిరాముడు ధర నీరేజవిశాలలోచనుడు, పరమామృతకరుణాలోకనుడగు - హరిచరణద్వయి శిరము సోకగను, సరసిజగర్భుడు మ్రొక్కిపలికెనిది ॥విను॥

తనువు మనసు ప్రాణము, లింద్రియములు, వినుత నిశ్చయాత్మక మగుమతితో - నొనగూర్చి భవత్పదవినతుడనై, తనని సుహృత్పుండరీకమునకు - గొని నిరతానందానుభవంబున, నెనయు వారు భవరహితుల భవత్రిభు - వనముపుట్టిపెరిగిగెడయు, టిదిసీ, ఘనమాయగడాయనె పితామహుడు ॥విను॥ 5

సూరిజనులు వేదాంతమునందలి, సారవిచారము చేసిఘోరసం - సారదుష్పీడితుల కౌషధంబు, దారభక్తియనిపల్కిరి గానయ- నారతమది దయజేయు మనిన విని, శౌరి యజునికరుణార్ద్రదృష్టిచే నారసినీయభిమతము లొసంగుదు, గోరుమనిననుత్సుకుడై పలికెను॥

శ్రీలలనాధిపచిత్తగింపుమీ, భూలోకమునను రావణుడనగా, పౌలస్త్యనిసుతు డొకడు గలడువి, శాలమైనతపమదీ[illegible]వరంబున

మేలుజెంది సురకంటకుఁడై కడు, చాలియున్న వాడతనికిమర్త్యుని-చేల యంబువిధియించితిదనుజుని, నీవామనజుడవై విధింపుమనె ॥విను॥ 7

వనజోదరు డిట్లనియెను కశ్యప, ముని మును సనుతనయుని గమ్మని వే - డిన నేసమ్మతిపడితి నిపు డతం, డినకులమున దశర థుడైనా డా - ఘునునకు కౌసల్యకు పుత్రుడనై, జనియించెద జని యోగమాయయె - జనకునియింటసీతయగునుపో, మ్మనిచక్రితిరోధా నము నొందెను ॥విను॥ 8

సురులను నిట్లనియెను చతురాస్యుడు, హరివాక్యము లెల్ల వింటిరే వా - నరుల సృజింపుడు మీయంశములను, పరమేశునకు సహాయము సేయుడు - పరమసమ్మతంబగు ననుచువసుం, ధరనూర డించి నిజవాసమున - కరిగెనలువ శేషాచలవాసుని, శరణాగత వత్సలు డది పొగడుచు ॥వినుము॥ 9

8 కన్నడ—ఆదితాళము

పల్లవి—అందముగ నీకథవినవే రజ. తాచలసదనా, పరిహాసితవి -
నిందితారవింద చంద్రవదనా, కుందబృందసుందర రదనా॥

అను—మందయాన దశరథవసుధేశుడు, మాన్యయశు డయోధ్యా,
శాంతుడు - పొందుగ దనయులు లేనందుకువగ, జెంది
వసిష్ఠునిజేరి పల్కెనా ॥నంద॥

మనవివినుముస్వామీ నాకిక శ్రీ, మంతులైనసుతులు,ఏలెర- పునజనియించెద రాత్మజహీనునకుధ, నంబు సుఖకరంబుగాదుగదా- అనిన రాజుకనియె నావసిష్ఠుడు, జననాయకనీకు కొడుకులు - ఘనుల మలయశోధనులునల్వురిక, గల్గెదరందు కుపాయముగలదనె ॥నంద॥-

శాంతుడైన ఋశ్యశృంగ మహాసీ, శ్వరునిబిలువనంపుమీవు - పుత్ర కామేష్టినిరంతర, సంతోషస్వాంతుడవై యొనరింపు-

మంతయు ద్వారగానడును శాంతా, కాంతుని రావించి, రిపుదు -
ర్దాంతుడు మునిపరివృతుడై సరయువు. చెంతయజ్ఞదీక్షకొనినిలిచె ॥న॥

వేదమంత్రములు బలుకుచు శుచియై, వేల్వగ హుతవహుడు
హవ్యము - సాదరమున గైకొనితగంబ్రదక్షి, ణార్చులలరజ్వాలియించె
నువసుప్రభుడై - ఖేదహరుడు యజ్ఞేశుడు దశరథ, వేదకీశ్వరునకు,
శుభసం - పాదకమగు పాయసపాత్ర మొసగి, పరమాత్ముడు సుతు
డగు నీకనిచనె ॥నంద॥ 3

లలి నలరిరి హానులులబ్ధమనో, రథుడై దశరథుడు. ముద
మున జెలగుచు ఋష్యశృంగవసిష్ఠుల, చేననుజ్ఞగొని హవిస్సు
వేడుకను - కలితగుణుడు కౌసల్యకు సగమును, కైకకు సగమొసగ,
వారలు - దెలిసి సుమిత్రకు దమయంశములం, దెలమి సగము సగమొస
గిరి నిరతా ॥నంద॥ 4

పరమాన్నము భుజించిన ముచ్వురు, తరుణులు గర్భిణులై, వెలి
గిరి - నిరతము సురకాంతలనగ దొమ్మిది, నెలలు నిండ కౌసల్యగనెను
సుతుని - పరగ చైత్రశుద్ధనవమిని పున, ర్వసు నక్షత్రమున, సుమ
నో - హర కర్కాటకలగ్నమునను శే, షాచలేశుడగు హరిజని
యించెనా ॥నంద॥ 5

## 9 శంకరాభరణము—అటతాళము

పల్లవి—శ్రీరాముని గాంచెను, పార్వతీవినవే - మనకౌసల్య, యా
త్మారాముని గాంచెను॥

అను—ఘోరమైహర్షాశ్రు, పూరముకన్నుల - జారభయసంభ్రమా,
శ్చర్యములైనగొనగా ॥శ్రీరాముని॥

అలనల్లకలువజే, కులచాయమేనిచే - జెలగువాని పసిడి,
చేలగట్టినవాని - వెలయునాల్గుభుజ, ములవాని కనుగొ - ల్కుల

వరుణరేఖలు, కలవాని స్వర్ణకుం - డలలసితగండమం, డలములవాని
యస్ఖలితరవికోటిప్రభ, కాసుని రత్నో - జ్జ్వలకిరీటమువాని, నళినీల
కుటిలకుం, తలములచే ముద్దు, గులుకుచుండెడివాని ॥శ్రీరా॥ 1

ఘనతరశంఖచ, క్రగదాబ్జములవాని - వనమాలిక యుఱు
తడనరువాని చిరున - వ్వను వెన్నెలలా, నవచంద్రుడు దిక్కు - లను
వెదచల్లజె, ల్వాలరారెడువాని - యనుపమానకరు, ణామృతపూర్ణనే-
త్రుని మంజీరాంగ, దుని శ్రీవత్సకటకం - కణహార కేయూర కౌస్తుభాది
భూషణభూషితునిజూచి తనివిదీగకతిరుగ ॥శ్రీరా॥ 2

శరణాగతులను, కరుణరక్షించు శ్రీధరనీకు బహువందనము
లొనర్చెద - శరణుగర్వితదనుజ చయవిరామరామ - శరణుదేవతా,
సార్వభౌమనీవే - పరమాత్ముడవు జగత్పతిపీశుడవు హరివి - వర
యోగిబృందహృ, ద్వనజకర్ణికాం - తరమునసురుచిర, రాకా
జ్యోతివై మెఱయు నిన్నెన్ననా, తరముగాదనితిరుగ ॥శ్రీరా॥ 3

ఈశనీవునిఖి, లేంద్రియసాక్షివి - శ్రీశుడవీవిశ్వ, సృష్టిసం
రక్షణ - నాశములొకటను జేసి సేయకున్న - వాశిచేణోయి, పావని
వాడవై ప్రకృతి - డాసిడాయనివాడ, వై శాశ్వతుడవై యాకాశాది
భూతసం, ఘములకెల్ల నవ - కాశమైనీవుప్ర, కాశింతువిదిమాయ
పాశాదిబద్ధుల కెఱుగవశముగాదని ॥శ్రీరా॥ 4

నీజఠరమునంద, నేకబ్రహ్మాండములీ - యోజబరమాణువులై,
యున్నవిప్పుడునీవు - రంజిల్లునాయుద, రమునబుట్టిటకల్ప - భూజను
ముంగిట, మొలచినట్లయ్యెనం - భోజాక్షపతిధన, పుత్రాదిసక్తనై
నేజెల్లసంసార, నీరధిబడనొల్ల - శ్రీజాని నీశరణు, జెందిలి నామదిని
దేజరిల్లుచును సుస్థిరుడవుగమ్మని ॥శ్రీరా॥ 5

ఈయఖిలమును మో, హింపజేయునీదు - మాయకునగుపడ -
జేయకునను శేషశాయి యీరూపమునుంహ, రింపగదోయి - కాయజ

జనక చ, క్కనిముద్దుపట్టివై - హాయిగానన్నలర, జేయుమమితానంద దాయివనినినుమదిని, దలతురఘునులెల్ల - మాయురేయనుచువే, మా గనువినుతించి - శ్రీయుతమూర్తియా, శేషాచలేశుడా ॥శ్రీరాముని॥ 6

10 ముఖారి—ఆదితాళము

పల్లవి—రామునిసకలగుణాభి, రామునినిఖిలరాక్షసవి, రామునివర్ణింపవశమా.

అను—వేమాఱుకౌసల్యనీవే, మేమిగోరినావదియెల్ల - శ్రీమీాఱనొసగితిననుచు, ప్రేమచే జననితోబలికిన రాముని॥

మున్నుబ్రహ్మానన్ను వేడు, కొన్న భూభారముదీర్ప - వన్నెమీారగనునేడు, నీగర్భమున - జెన్నలరబుట్టితి జూడు: రావణాసురుడన్నిటగర్వించినాడు, వానివధియించి - సన్నుతిగాంతునీ రేడు, జగములలోన - మున్నలరదశరథుడునీవు, నన్నుదపమున మెప్పించి - కన్నారునీవదితిసుతుడు, కశ్యపుడని కౌసల్యకుదెలిపిన ॥రాముని॥ 1

అనుచు దల్లితోబలికి, హరిముద్దుబాలుడై కలికి - తనమున హరి నీలగాత్రుడై, వికసితనవ్య - వనజదళవిశాలనేత్రుడై, చక్కనివా - డనుచునుతియింపపాత్రుడై, అమలప్రకాశమునకు జూడదరుణమిత్రుడై, విలసిల్లెనంత - ఘనుడైన తనయుడుగ్గై - ననివిని దశరథుడానంద - మునను గురునితోడగూడి, చనుదెంచికన్గొనెను శ్రీరఘు ॥రాముని॥ 2

విరులవానలపుడుగురిసె, వేడ్కజయదుందుభులు మొరసె - సురసుందరులెలమినాడిరి, గంధర్వవరులు - సరసులై రాగములు బాడిరమానులుదోషా - చరులవలనిభయముపీడిరి, పౌరులానంద - కరుని చూడగుమిగూడిరి - దశదిశలయందు - పరిమళమిళితములైన తెమ్మెగలువిసరెదివినిసురలు - వరవిమానారూఢులై శ్రీ, హరిహరి యని మ్రొక్కిరాత్మ ॥రాముని॥ 3

ఘనవిభుడై నకోమలుని, గనెను కైక చంద్రబింబా-ననులను సుమిత్రగనెను సుతులనిర్వురను - మొనసిసంతోషమునను - దశరథుడుసకల - ధనములవిప్రులదనిపెను, వసిష్ఠమహాముని యూబాలురకు క్రమమునను రామభరత - లక్ష్మణశత్రుఘ్నులనుచు నామకరణము లొనరించెను భరతుండును శత్రుఘ్నుడు జోడై లక్ష్మణుడు ననుసరించెను దశరథ ॥రాము॥

చెలగిసౌమిత్రితోఁగూడ, మెలగుచుం దేనియలొలుక-బలుకు సుతుని నృపుడుగాంచి, భూషణజాల - ములతోడ నలంకరించిశిస్తుగ గస్తూరి - తిలకమునుంటనుంచి, గళమునరత్న - కలితహారములు గీలించి, ముద్దాడునపుడు - కలకలనవ్వుచు మద్ది, కాయలల్లాడనందియలు - ఘల్లుఘల్లుమనుచు మ్రోయ లలితగతుల నటియించు (శ్రీ) ॥రాముని॥

చిన్నారిబొజ్జలోనన్ను, గన్నవాడానాపాలిటి - పెన్నిధానమ రారా, హోరినాచిన్ని - యన్నబూచివచ్చేరారా, పరుగెత్తవల - దన్ననాతో నలుగబోరా, పాటపాడుచు - నిన్నులాలిమూచేరారా లాలబోసేను-మన్ను చేతనంటనద్దు వెన్నబెట్టేననుచుచాలామన్నించి
పలుకు కౌసల్యకు, మురులురెట్టింప జేయు (శ్రీ) ॥రాముని॥ 6

ధరణివిభుడు భుజియించు, తఱిని కౌసల్య తనయుని - మురిపెమునరమ్మనుచు జీర, వర యోగిహృదయాం - తరమునందు జెల్వుమీర, వసియించు దేవుడు - చిరుతవాడయిముద్దుగార, వచ్చినజూచి తరుణితనదుకోర్కెలుమీర, ! కౌగిటనుంచి - కరుణించిభుజియించుమనిన, కబళము చేనందుకొని - తిరుగానాటలాడుపరుగెత్తినమాయా
బాలకుడౌ (శ్రీ) ॥రాముని॥ 7

వితతయశుడుదశరథభూ, విభుడంతటకౌమారాన్వితులసుతుల దిలకించి, యుపనయనములు - నతులముగ నొనరించి, వశిష్ఠునొద్ద -

శ్రుతుల నెల్లజదివించి, చతురంగముల_గతుల దెలియ నేర్పరించి, చా
పవిద్య - చతురులనుగావించి, హర్షించవారు - సతతముగురు
బంధుమిత్ర, జనులకెల్లహితులై ధైర్యో - న్నతులై పరగిరందులో
శ్రీ, యుతుడయి సత్యవ్రతుడైన శ్రీ ॥రాముని॥ 9

తల్లిదండ్రులకు ప్రియము, దనరగ నశ్వము నెక్కి-విల్లునమ్ములు
చేపట్టి, వేటలాడుచు-మొల్లమున నడవినున్నట్టి, మృగములగుండెలు_
ఝల్లుఝల్లన జుట్టిముట్టి, పోనీక వాని-నెల్లచలపట్టిపడగొట్టి సౌమిత్రి
గూడి-బల్లిదుడై యన్ని యయోధ్యావల్లభునకు కానుక జేసి - సల్లలి
తుడై సకలజనుల, సవినయము బాలించు శ్రీ ॥రాముని॥

శైలరాజకన్యకా యీ, చందమున మనుజావతార - లీలనై
వర్తించె శౌరి, గనుగొనుమింద్ర - జాలకుడు చక్రధారి, సమస్తవేద-
మూలమై విలసిల్లుదారి, యజ్ఞులు దెలియ - జాలరతడు నిర్వికారి,
విమతసంహారి - శ్రీలచే జెలువందు శేష, శైలశిఖరావిగ్రహారణ -
శీలుడై సద్భక్తలోక, పాలుడైదనరు నిత్యాత్మ ॥రాముని॥

## 11 నాదనామక్రియ—అటతాళము

పల్లవి—ఇందువదనా వినవె యీ చరితము, కుందరదనా:

అను—డెందము శ్రీమన్ము, కుందుని పాదార - విందములందా నం
దింప జేసి రా ॥కేందు॥

ధీరుడు విశ్వామి, త్రుడు తానయోధ్యకు - శ్రీరాముని జూడ
వచ్చెను, అని - వార్యుడై సౌధముజొచ్చెను, ఎదురు-గా రాజు చని
తోడి తెచ్చెను, మునికి-చారుసింహాసనమిచ్చెను, మహో - దారుడై
పూజయొనర్చెను, కరము - లారూఢి నొదల జేర్చెను స్వామి-మీరు
వచ్చుటకేమి, కారణ మదిదెల్పు - డీరాజ్యమైనమీ, కిచ్చెదన నెను
రా ॥కేందు॥ 1

కౌశికుడా పూజ, గైకొనిసల్కె-భూ - మీశమారీచ సుబా
హులు, మాం - సాశనులద్భుతదేహులు, ఘోర - పైశాచిప్రేత
వాహులు కాల - పాశవిడంబితబాహులు, దివి - జేశాదిసురముని
ద్రోహులు, యజ్ఞ - నాశకు లధికదుర్మోహులు గా-డాసి వారల
పొగర, డంచసలత్నంబుసు - జేసి రామునిబంపు, మీశుభమౌనవె॥

భూమీశుడే కాంత, మునవసిష్ఠుతో బల్కె - నేమినేయుదు
నేమందును, నెట్లు - రాముని నెడబాసి యుందును, సుగుణ - ధాము
నెన్నడుగనుగొందును, గురు - స్వామి యెవ్విధిసుఖము జెందును, ఈ
విశ్వామిత్రునుడి యెటువిందును, ఇతని - కేమిమనవి జేసికొందును,
నేను - యీమాట వినకున్న నిపుడే శాపమిచ్చు - నీవకానియని
నగుప - డిట్లని యనెనురా ॥కేందు॥ 3

వరవరవినుమిది, పరమరహస్యము - నరుడా శ్రీరఘురాము
డుఘోర - దురితాంధకారవిరాముడు, హరి - పరమాత్ముండు
కమలాకాముడు, భక్త - వరదుడు ప్రణతసుత్రాముడు, దిన -
కరవంశ జలనిధిసోముడు, మాని - వరదేవతా సార్వభౌముడు,
ఇతడు - పరమేష్ఠిచేతొల్లి ప్రార్థితుడయిభూమి, భరముమాన్ప నీ,
వరతనయుడాయెనని ॥నిందు॥ 4

రాజా నీవు కశ్యపబ్రహ్మవు కౌసల్య - జేజేలకెల్లనుతల్లి, అదితి
నాజనుతరుణీమతల్లి, మీరు - శ్రీజానిభజియించితొల్లి, చాలా -
పూజింప నతడుల్లసిల్లి, సుతుడనై జనించెదమీకు నెల్లి, నని య
వ్యాజకరుణారసముజల్లి, నేడు - రాజీవాక్షుడు రాము డైజూపట్టె
శేషు - డేజుమిలక్ష్మణు, డిదినిజము నెనురా ॥ కేందు॥

వరశంఖచంక్రము, ల్భరతశత్రుఘ్నులై - రదుదారహరి యా
జ్ఞ చేతసురు - చిరయోగమాయ యొసీత, యనగ - మెలసిజనకవం

జాతయై పరగుచున్నదిధీసమేత, వినుత - సరససద్గుణమణివ్రాతయిది
పరమగోప్యము స, లక్ష్మణుని రామునిమాని - వరు వెంటబంపుమని
బల్కెవసిష్ఠు ॥డిందు॥ 6

రామలక్ష్మణులను, రాజుపిలువబంచి - ప్రేమతోకౌగిటనుం
చెను, తనమహా - మహిమనుతియించెను, తన - దేమహాద్భాగ్య
మనియెంచెను, విశ్వామిత్రుజాలపూజించెను, ఘన శ్యామునినతని
కర్పించెను శుభ - మామీకనిదీవించెను, శ్రీరాములంతటధను, ర్బాణ
తూణీరధరు - లైమించి మునివెంట, నతిమోదమునజని ॥రిందు॥ 7

లలినిబలాతిబ, లలను రెండువి-ద్యలురామునకుమానియిచ్చెను
రాము - డలరిగంగానదినిమెచ్చెను, - ఆవబోవదాటకి, వచ్చెను -
దాని - బొలియింపమని సెలవిచ్చెను, ఒక్క - ములికియురమ్మున
గ్రుచ్చెను, దనుజ - విలవిలతన్నుక చచ్చెను, ఆవెలదియాంబిడరూపు
విడియక్షసతియై - చెలగి రామునిబొగడి, శ్రీమీ౦జజనెను ॥రాకేం॥8
కౌగిట రాముని, గదియించి జడదారి, వేగమేశిరము ముద్దా
డేను, అంత - బాగాయెనని కొనియాడెను. మహా-యోగిధ్యేయుడ
వనుచువేడెను వీత - రాగుడై భయమెల్లవీడెనునిగ - మాగమ
మంత్రర; హాస్యములనుదెల్పె-నీగతిశేషగిరీశుడౌహరికి ॥రాకేందు॥9

12 సౌరాష్ట్ర—ఆదితాళము

పల్లవి—వినవే సుగుణాన్వితా, గిరిరాజసుతా॥
అనుపల్లవి—మునియుతులైరాఘవులు కామాశ్రమ - మునను నాడు
నిలిచివేకువ - ఘనులుసిద్ధాశ్రమగతులై రచటి - మును
లారాఘవులను బూజించిరి ॥విన॥

శ్రీరఘురాముని, చే ననుజ్ఞగొని - సారయశుడు విశ్వామి
త్రుడు క్రతు - వారంభించె, మహాజనవృతుడై - సారెకుమారీ,
చసుబాహులస్ర - గ్ధారలఁగురిసి రహో - ధీరుడు దాశర, థిమహో
ద్ధతుడై - మారీచుననిల, మార్గణమున - వారిధిలోబడ, వైచి
సుబాహుని - దారితుజేసెను, దహనాస్త్రమునను ॥వినవే॥ 1

సునిశితబాణము, లను సౌమిత్రిత - దనుచరులను జంపెను
బువ్వులజడి నెనసి సురలుగురి, యించిరి సంభ్రమ - మునను గుశిక
సుతు డినకులతిలకుని - తనతోడ నిడికొని - నెనరునగౌగిట నునిచి
లక్ష్మణుని, మునునిడికొనియా, డి ఫలములు, అనఘులకునుభోజనము
లొనర్చెను, దినములుమూడిటు, జనెను సరసముగ ॥విన॥ 2

మునిపతిశ్రీరా, మునితోబలికెను - జనకునియాగము, గను
గొనజనియెద - ననువుగమీకువ, చ్చిన శుభవహానని - వినతుడగుచు
నను, జునిగూడితపో - ధనువెంటముదముతో - జనిచనియెదుటను
వనమొకటిఫలసు, మన స్తరులతాలం, కృతమైజనవిహితమై, గనుపట్టె
నది, వనమేమన రా, మునితోమునిబలికె ॥వినవే॥ 3

గౌతము డనుముని, గలడులోకవి - ఖ్యాతుడాతని క,
హల్యయనుసతిసు - ధాతయొసంగెనా, దంపతులిచ్చట - బ్రీతినుండ
నిం, ద్రుడునొకనాడా - గౌతమవేషమున - నాతినెనసిచను, నాతరి
స్నాతుడై - గౌతమమునివచ్చి, భస్మీ - భూతుజేతునాతో బొంకను-
మన బురుహూతు దుర్మతినైతి గావుమనెను ॥వినవే॥ 4

శాపమొసంగెను, సహస్రభగుడవై పొమ్మని వృత్రారినహ
ల్యను కోపమునశిలా, రూపము గమ్మనె - నేవరజంతుర, హితముగ
జేసెను - యీవనమౌని - బాపురేయెన్నడు నీపైరఘుపతి, శ్రీపాదము
వెట్టునాటికి - శాపముచెడునని, జనె సతీమణికి, పాపముబాపవె,
పరమపురుషా యనెను ॥వినవే॥

రామునికరముక, రమ్మనబట్టిమ - హామునియప్పుడ, హల్య
నుజూపిన - భామపై నిద్దన, పాదమునుంచి మ - హామతియగుచున
హల్యతనరగని, రాముడుతాఁ బ్రొమొక్కె - రామామణియు సలక్ష్మ
ణునిధను - ర్బాణధరుని కనకాం, బరుని - శ్రీమన్మందస్మితవదనుని
శ్రీ, రాముని శేషాద్రి - ధామునిజూచెను ॥వినవే॥

## 13 బిలహరి—ఆటతాళము

పల్లవి—శరణు శరణని రామ, చంద్రునియహల్య । సన్నుతించెను
వినవే॥

అనుపల్లవి—పరమపురుషుడనుచు, గౌతమవాక్య । సరణిమదిలో
నెన్నుచు । శౌరికిఁ బ్రొమొక్కి । యరుదా, రనర్ఘ్యపా, ద్యము
లిచ్చి హర్షవిస్ఫురితాక్షియైమించి, పులకించి, నీ । చరణరజ
పరాగమునను దురితమెల్లను, దొలగెనహహా । గరిమతోను
గ్రు, తార్థనైతి జగత్ప్రభో కమ, లావిభోహరి ॥శరణు॥

యేవిభు పాదరాజీవరేణువులచే, బావనమైనది భగీరథీమహా
దేవబ్రహ్మదిసు, రావళి సేమహానుభావుడు గావించె, నేవరదు
పదరజము । వేవేలవిధముల వెనుకబడును శ్రుతులు । చేవనజభవు
డవని, శ్రీనాభిపద్మమం । దావిర్భవించెన, వ్యయుడైనపుర వైరి ।
యేవిశ్వగురునామ, మేప్రొద్దుభజియించు । నీవీరవరుపాద, మీభువన
జాలముల, నెల్లనాక్రమించెను । శ్రీవనితామణికి నెవ్వనియురము,
చెలగివిహరింప నునికిపట్టయ్యెనే । దేవునిపదము నిందితరాజయోగి
హృద్ధ్యేయమై తనవారి చెలువుమీఱు । నావిభుండా వరదుడ
గురుడాపకుండా దేవుడిదెనను । బోవుటకు ప్రత్యక్షమయ్యెన ।
భావిచిత్రమటంచు నెంచుచు ॥శరణు॥

శ్రీరఘువరనీ, లీలలత్యద్భుతము - లేరికిలరముగాదివి తెలియ
మర్త్యావ - తారమునను జగ, త్త్రియము మాయామోహా - పార
వశ్యమునొంద, భ్రమియించితివి నిర్వి - కారుడవీవుచలనాది రహితు
డవు - కారచలనాదులు, గలవారివలెనుందు, వారయపూర్ణుడ -
వానందమయుడవ - క్రూరుడ వతిమాయి, కుడవు సంవిస్మయో -
దారవిశుద్ధుడ వాత్మప్రజ్ఞాఖండబో, ధస్వరూపుడ వజుడవు - పార
మార్ధికుడవీ, భూతములకా - ధారభూతమునీవే, యీజగమునీవే,
సారెకుజగదాశ్రయుడ వీవేకర్త్రు-కారణకార్యములు నీవిలాసములు
చేరిగన్గొనగనే రకతనుధారివందురుగాని నిన్ను-విదారితాఖిల కలుష
మగు పరతత్త్వమనఖిలులచే నగునా ॥శరణు॥ 2

జలజలోచననీ, వలఘుమాయాగుణములచే బింబితుడవైవిల
సిల్లిజగదుదయ - విలయములకు బ్రహ్మ విష్ణ్వీశ్వరనామ-ములబూని
యున్నావు, తెలియగనొకడవై-వలనుమీఅగాను, వాచ్యవాచక
భేదములజగన్మయుడవై యలరుచుందువునీ వ - స్ఖలిత తేజడవోం,
కారవాచ్యుడవువా - క్కుల కగోచరుడవు - గూఢవర్తనుడవు -
భళిభళిశ్రీరామభద్రగుణోన్నిద్ర, ప్రధానాంగణరుద్ర, కలితకౌస్తుభ
హార, శ్రీశేషా-చలశిఖరవిహార, మోహనాకార-చెలినిచంచలసుని
శ్చలజ్ఞానమార్గము - దెలియనెంతటిదానను, నీదానను - కలుగజే
యుమునాకునీపద, నలినభక్తి నిరంతరమ్ముగ జెలగివందనశతములో
నరిం, చెదను దాశరథీ దయానిధీ ॥శరణు॥ 3

## 14 బేగడ—ఆదితాళము

పల్లవి—నీలవేణి వినుతగుణశ్రేణి, వినవే శర్వాణి -
అను—ఘునాఘునాంగుడౌ రా, మునిచే ననుజ్ఞగొనిగౌతమ - ముని
యొద్దకుజనె నహల్య, మునీంద్రు డా రామునిజూచి పలికె



ఘనంబుగను మిథి, లాపురంబునను, క్రతువరంబు మహే శ్వర చాపము కనుంగొనియనంతరం బయోధ్యకుజనెదమనన్ పినమ్రుడయ్యెను హరి హరి ॥విసీల॥

రంగదభంగతరంగగంగను, ప్పొంగుచుదాటివిదేహరాజపురి- చెంగటరాగ నెఱింగి జనకుడుచె, లంగుచు నెదురుగను - రంగుగ జనిగాధేయునకునుసా, ష్టాంగ మెఱిగిపూజించి దిశలువెలు - గంగ జేయుచంద్ర సూర్యులోసుర, పుంగవులగు నరనారాయణులో-శృం గారకళలబంగారుతళుకుల - నంగాను దగినవీర లెవ్వ, రెఱుంగ వల యునన దశరథాత్మజులు - మంగళకరులీ రామలక్ష్మణులు మహాభు జుల్ ఘనులని మునిదెల్పెను ॥విసీల॥

శివిగమత్రక్రతుసంరక్షణమున, కైపీగలనే దోడితెచ్చునెడ - పావనుడీ రాఘవు డొకశరమున, జావనేసె దాటకను - భావర మదీయయాగవిఘాతకులై, వరలు సుబాహుప్రముఖనిశిచ, రావళి ద్రుంచియు మారీచుజలధిలోవైచె బదాంబుజ రజమునను, యీ వీరు డహల్యను వేవేగ బవిత్రను, గాంచి నేడు నీగృహంబున గరళకంఠువిల్లనుగొనవచ్చెను - నావుడునగరికి దోడ్కొనిచనియా నరేంద్రుడారాముని బూజించెను ॥విసీల॥ 2

అంతట జనకుడు మంత్రులబిలిచి పురాంతకు విలుదెమ్మనిన భటులన - త్యంతబలుల నైదువేలబంపిన, బంతముమీరజని - సంతతమును మణివస్త్రాదులచే, నెంతయు భూషితమై ఘంటాశతకాంత మైనవిలు దెచ్చినధరణీ, కాంతుడుకౌశికుగనుగొని యా, వింతనృ పవరు లతాంగిజూడగ సంతోషమునరఘూద్వహుండీ, చాపమెక్కి డిన జాలును సీతా - కాంతనిత్తునన విని శ్రీరాముని, కనుంగొనె న్మునిదరహాసమునను ॥విసీల॥

శ్రీరాముడు వామకరంబున విల్లారూఢిగ గొనియెక్కిడి నృపతులు-చేరిచూడదక్షిణకరమునననె, దారదిగిచినపుడె-సారము చెడి ఫెళఫెళమనివిరిగెను, వైరివరులధైర్యముతో గూడద - దారవముదిశల్నిండెదివివిమా, నాహూతు లగుచుగను గొనుదేవత - లా రాముని శ్రీమీర, బొగడిరి-తోరంబుగా బ్రసూనవర్షము - దుందుభి ధ్వనుల్సురవనితాజన, చారునాట్యములు చెలగరాఘవుని జనేశు డర్మిలిగాగిట నుంచెను ॥విసీల॥

ఫుల్లాంభుజపత్రాక్షుడు రాముడు, విల్లువిఱచుటలు వినియంతఃపుర - పల్లవాధరులు మనసీతకు శ్రీ,వల్లభుడనందగిన - వల్లభుడిదె వచ్చెను చల్లనివా, డెల్లజగములను నేలజాలువా - డల్లమరున్నైన జక్కదనమున నుల్లసంబులాడునటియమ్మక - చెల్లా రామునివల్లా కోరిక- లెల్ల ఫలించు వంశపావను, డీమహాత్ముడంచనిపలికి సరస - సల్లాపము లాడుచు సీతికుమణి, సరు ల్వైదల్ హారువుగ గైసేసిరి ॥విసీల॥ 5

పట్టుచీరెనుగట్టి రవికెచను, కట్టుదిట్టముగ గట్టిమృగమదము బొట్టునుదుటనునిచి కనులకాటుక, బెట్టికురులుదువ్వి-దట్టముగాకీల్మడి వైచిమల్లెన్, మట్టుమీఱ వేడుక చేసరములు-జుట్టి సర్వభూషణములు మేనను, దట్టముగాబూనియొక్క చెలికేల్ బట్టి, జనకునిపట్టి, శౌరికి - పట్టంపురాణి నౌదు నేనని, బాళితోడగుందనపు బొమ్మవలె - నెట్టన రాజమరాళ కరిగతుల. నెరానిరాకరింపుచు నడిచెను ॥విసీల॥ 6

తాటంకి ద్యుతిదిక్కులనెల్లను, దీటుకొనగ బాపటబొట్టును సరిసాటి లేనిచంద్రసూర్యులును స, య్యాటమునను మెఱయ- తేటపు ముత్యపుసరులు పతకములు, మేటిచిలుక తాళితోడ బెనగొన - మాటికినందెలు ఘల్లనిమ్రోయుగ, దీటు లేనివైఖరిసీతా - వధూటి

గుణముల హారికి - సీతాదిభూషణాఢ్యు శేషగి, సీత రామభూవిభుని చేరిమణి - హాటక మయమాలిక గళమునసిడి, హరిన్ వరించితి నని చనె ముదమున ॥విసీల॥

15 కాఫీ—జంపెతాళము

పల్లవి—వినుహైమవతీఘనా, ఘనసుందరాకృతీ- వినుతధృతీకరుణా
మతీ॥

అనుపల్లవి—తనమంత్రులను బనిచె దశరథుసితోడితె - మ్మని జనక
నృపతివేగా బాగా ॥విను॥

ఆరూఢిదివసత్రయమున వారలయోధ్య, జేరిదశరథునిగాంచి- ధీరులై మ్రొక్కి బహుదివ్యవస్తువులనరు, దారగాగాన్కయుంచి- శ్రీరా మునకుజయశ్రీరమా రామునకుసీతనునిశ్చయించి - నేడుశ్రీమీరమిము బిలువనం, పెను జనకు డన సంభ్రమించి వేడుకదలంచిమించి ॥విను॥

జనవిభుడు శ్రీరామ, చంద్రునకు గల్యాణ, మనిచాటనాన తిచ్చి జనకమంత్రులకు నుత్సాహమున రత్నభూష, ణదుకూలముల నిచ్చి - తనగురుండగు వసిష్ఠుని సుమంత్రుని రా, మునిపెండ్లివార్త దెచ్చి - తగుగదా. జనక విభు బాంధవ్య, మనిన కడు శ్రేస్సయని, రనువుగాముదము హెచ్చిమెచ్చి ॥విను॥

మరునాడు గురుహితత, సమస్తజనులెల్లవే, మజుబలసికొలువ గాను, అరుదై వయాణిము, త్యములగొడుగులనీడ, నధిక వైభవము తోను - భరతశత్రుఘ్ను లిరు, వురు గజారూఢులై, యిరుగడల జేరిరాను - రథమెక్కి, నరవరుడు మిథిలానగరమునకు జనె నెలమి, నాల్గుపినములలోను, తాను ॥విను॥

హితమతిని దశరథున, కెదురుగాజనిపురో. హితసతుహితుడై జన కుడు - చతురుడై పూజింప, సరసులై రామలక్ష్మణులు తమ తండ్రి

కపుడు - అతిభక్తిప్రణమిల్ల, నాలింగనమొనర్చె నానందమునను నృపుడు - తతమహోన్నత జనకరాజసద, నమునసుతకౌశికా, న్వితుడై వసించెనతడు, జనహితుడు ॥విను॥

తనయాగకర్మమం, తయుదీర్చి జనకుడుశ, తానందుతోడ ననెను - దనరసంకాశ్యపుర, మునమదనుజుడును కుశ, ధ్వజుడుండు మోదమునను - మొనసిపిలువనంపుమన, వినయట్లుసేయఁజ య్యానవ చ్చియతడన్నను - పొడగాంచి-తనకుమారికలు తా, నునుమ్రొక్కి-వర్ధిల్లు, డనుచు దీవెనలుగొనెను, మనెను ॥విను॥

లలినిజనకుడు పురమ, లంకరింపుమనదో, రణచయోల్లాసితంబు - అలఘుసౌధధ్వజో, జ్వలము గోపురవితా, నావళీలాజితంబుఫల భారనమ్రరం భాస్తంభశోభిత, ప్రతిగృహప్రాంగణంబు - కర్పూర - కలితాంబుపూరగం, ధిలరాజమార్గంబు, కై సేసిరాపురంబు,డంబువి॥

క్రమముతోనంతఃపు, రములంకరించిబం, గారుకుంభముల నుంచి - సమమైనపచ్చరా, జగతిపై నిలిపిసీ, లములతోదెలుఘుటించి రమణీయముగనుబఁగ, డములమాలములు వ, జ్రముల గొడిగెలు రచించి - చతుర్ద్వా - రముల గొమరొప్ప గల్యాణవేదిక గట్టరమరి కనుసంతసించి, మేలెంచి ॥విను॥ 7

ఎలమిసీతాదికాం, తలకు నలుగులుపెట్టి, తలలంటిజలక మార్చి - జిలుగులనుదడియొత్తి, చెలగిసరిగంచుచీ, రెలుగట్టికురులు గూర్చి వలనొప్పగొప్పకొ, ప్పూలుబెట్టిచందనం. బలదికములుదీర్చి - రవికలను - పొలయుచనుకట్టుపై, నలవరిచికై సేఁతు, నలదిరి సమముగఁజేర్చి - మదిచేర్చి ॥విను॥ 8

పరగకేకయపతికు, మారుడు యుధాజిత్తు, వచ్చెనచ్చటికి నంత - వరుసదశరథుకున, ల్వురుసుతులభూషణా, వళులగై సేసి చెంత - సిరులలరదాసుండు, తరిజనకుడానంద, భరితుడై భద్రదం

తావళములను, గరిమమునబనుపరా, ఘవులెక్కి రాజమా, ర్గమున జూపట్టిరంత వింత ॥విను॥ 9

పొడలుచును గౌసల్య, మొదలౌ సతులు, గొల్వభూపతులు జేరికొలువ - విదితమాగధవంది, బృందములు గొలువనట, విటగాయకులును గొలువ - సదయులువసిష్ఠ వి, శ్వామిత్రులాశీర్వ, చనములొసంగుచును గొలువ - కళ్యాణ - సదనమునకరిగెశే, వగిరీశుడగు రామ, చంద్రుఁ డెదముదము మొలువ, చెలువ ॥విను॥

## 16 కల్యాణి—అటతాళము

పల్లవి—కల్యాణము వినవే, నేఁడు సీతా, కల్యాణము వినవే॥

అను—కల్యాణమయమైన, కల్యాణనిలయమున - కల్యాణప్రదుడౌయ, హల్యావరదుని ॥కల్యా॥

వేదనాదములు వేణుమర్దళవీ - ణాదుందుభి డిండిమాది మహావాద్య - నాదములు పుణ్యాంగ, నాబృంద శుభగాననాదములఁ జెలగజ, నకుఁ డెదుర్కొని దశర - థాధి భూపతులకర్హాసనమునిచియామీఁద సపురోహితుఁ డై దేవముఖుహైమవేదిఁబ్రతిష్ఠించి, వివిధమంత్రములచే, వేదోక్తహోమ, విధులొనరించి సీ - తాదికన్యలధన్యలనల్వురను స - మ్మోదమునరావించి, మురియుచుశుభజాలా -పాదకముగమధు, పర్కమిచ్చి వేడ్క, బ్రోదిజేసినృపుడు, పూజించె రాఘవుల ॥కల్యా॥

శ్రీమీఁర జనకుడు, శృంగారవతియై సౌ, దామినీలతమాడ్కి, దనరెడుసీతా-కోమలి తెఱమఱు, గుననుంచిచాలగా - రాముని రామాభి రాముడై న శ్రీరామచంద్రునిపాద, రాజీవములుగడగి - సేమమున తజ్జలము, శిరమునధరియించి,నీమముతోసీత, నిఖిలలోకమాతగామితసిద్ధసఁ-కల్పపూర్వకముగ భూమీశుడుధార, బోసె నగ్ని

సాక్షి - గామానవతిని రా, ఘవుడు చేకొనె దేవ - తామందార
సుమధారలుగురిసె భద్రామితగుణులై, యనిరువధూవరులపై ॥కల్యా॥

అంతట దెరదీయ, సతివమోముజూచి - సంతసించెను, రాఘ
చంద్రుకన్నవతార - కాంతుగను గొనియులరు, కలువలిపోల్కి నా -
యింతిచూపులుదనరె హృదయేశుపదయుగళి - నెంతయుదామరల,
నెనయు తేటులనగా - కాంతామణిపాణి, గ్రహణమొనరజేసి -
కంతుజనకుడుమం, గళసూత్రముగట్టి - దంతిగమనకుమణులు, తలం
బ్రాలుపోసి శ్రీ-మంతుడై లాజహోమముజేసి కృతకృత్య - స్వాంతు
డయ్యెను తాట, కాంతకు డటమీద - సంతతానందమున, జనకు
డూర్మిళ నిచ్చె, మంతుకెక్కగాను లక్ష్మణకుమారునకు ॥కల్యా॥ 3

వరుసతోడనుశాళ, ధ్వజునికొమార్తెల - సురుచిరమాండవి
శ్రుతకీర్తులనిరువురను-భరత శత్రుఘ్నులకును జనకధరణీశు డానంద
భరితుడగుచు నొసగె నరుదారగాబెండ్లి - యలరారె నావేళ జిర,
తరయశులు, వసిష్ఠవిశ్వామిత్రు - లురువుగ నావధూవరులకు సేసలు
శిరమునవిడిరియా, శీర్వాదములు జేసి-ఇనవంశదశరథా, ధీశుడుదీవిం
చె-గరిమనుకౌసల్య, కైకసుమిత్రాది - కరిగమనలు మంగళహారతు
లొసంగిరా - తతి రామలక్ష్మణభరతశత్రుఘ్నులకు ॥కల్యాణము॥ 4

జనకవిభుడు కౌశికునివశిష్ఠునిగను - గొనిపల్కె నారదముని
యచటికొకనాడు, చనుదెంచినను వినుమనిపలికెహరిభక్త జనవరదు
డని, నిర్జనులను బ్రోవరావణువధియింప రఘువంశమునను రాము -
డను పేర దాశరధి, వైనాలుగంశములు - జనన మొందెనుసీత, యను
నామమునసీయిం - టను యోగమాయబుట్టెను దెలిపి కౌసల్య తనయు
నకు సీతనిమ్మనిచనెనది మొదలుగనుసీత శ్రీసతి, యనిదలచి యేవిధము
నరాముడల్లు డౌననిచింతించిధను, వను నెపమునమీదయునుశుభము
గంటినని ॥కల్యాణము॥ 5

శ్రీరామచంద్రుని జేరి జనకుడు బలికె-శౌరీ నా జన్మము సాఫల్య
మాయెను - దారసింహాసనస్థలిని సీతాయుతుడవై రంజిలనిన్ను జూడ
సర్వజ్ఞుడనైతిరా - మారమణభువననిర్మాణనైపుణిగలిగె, నీరజభవునకు
నీపాదవారిచే - నీరమ్యపదజలము నెరిదాల్చి బలిమహావీరుడై సుర
రాజ్యవిభవము చేకొనె - సారమౌనీపదరజమున నహల్య ఘోరశా
పముదొలగె కోవిదులును నీయు - దారాంఘ్రిరేణువులు కోరిభవ
భయదూరు, లైనట్టినీవే శరణని పొగడె రాముని ॥కల్యా॥ 6

సారిదియాసమయమున, సురదుందుభులు మ్రోసె - ధిగుడు
తద్ధిన్నాం తకిటతక, తా - ధైధైయ్యయనుచు నచ్చరలా - డిరిగంధర్వ
వరులు బాడిరి భూసురవరుల ధరణీ, వరుల బూజ చేసి-సరసమృష్టాన్నా
భో, జనములిడి రీకరణి పరగ నాల్గునాళ్ళు, జరుగుటయు, గాధికుడరిగె
నల్లుండ్రకు, సరణమిచ్చి నృపుడు కరుణచే బుత్రికల ఘనమతుల
గాంచి - త్వరతోడం బనుపనా, దశరథక్షితిపతిపవరసుతులు గోడం
డ్రు సిరులలర నాశేవ - గిరివాసుడైన రఘువరుని మున్నిడుకొని
పురికి ప్రయాణోన్ముఖుడయ్యె ముదమున ॥కల్యా॥ 7

### 17 సురటిరాగము—ఆదితాళము

పల్లవి—చేరి వినవె శౌరి, చరితము - గౌరీకుమారీ గిరివరకుమారీ॥
అను—వారిజాక్షు డంతటను శ్రీ, మీరివేడ్కతో నయోధ్యకు -
గోరిపోవుదారిలో నృపవైరియైన పరశురాముడు కారుమొగుల
కరణి చాపధరుడై, కాలమృత్యువో యనగ బంక్తిరథు -
కేరిహరి యెదుటను నిలిచిపలికెను, వీరాధివీరుడని యెఱుం
గక ॥చేరి॥

బెండువంటివిల్లు నడిమికి, రెండుజేసి పిల్లు, - పొందుకొండనెన
యుజెల్లునా విలు, దండివైరులకుముల్లు కడు గండుమిగిలి దీనినెక్కు
బెట్టిన, గాని రాముడ ననునిన్ను నటుగాకుండిన జంపుదు ననరాను
ఢలనికో, దండముగొనిచక్కనెక్కిడియు, ఖండాశుగముతగదాడిగితె

గ, నింకదిగిచిభార్గవుడనిను కాండహతచరణుజేసినృపకాండాభిరాము
డనాదువనివ-బుండరీకలోచనుండితఁడని. పూర్వకాలసంస్మృతిపొడమి
పొగడి-భండప్రచండపండితుండవజాండాధిపతినవ్యయుడవనెను ॥చేరి॥

బాల్యమునను నేను, ఘోర, తపంబుసేయుచోను, హరివా-
త్సల్యమొప్పగాను, వేగప్రసన్నుడై పలికెదాను, సాఫల్యమయ్యె
నీతపముజన సమ్మతమునున్నివంశయుతుడవగుచు. ఫల్యంబలుడవ
గుచు బితృహీనుడగు, కార్తవీర్యగెలచి ఖలనృపులవై - కల్యా
త్మకోలజంపి శమదమ, ముఖ్యార్థితుడవగుమునేగా, సల్యాగర్భమున
రాముడన గల్యాణదాయినై జనించియు - హల్యాసతి బవిత్ర జేసి
సీతను, గల్యాణమైనీకు దరిశనమ, తుల్యముగనొసగుదునని జనియె
దయ, తోనాహరియనీవని చనియె ॥చేరి॥ 2

స్వామినేనుమించి, హేహయ. వంశజులనుద్రుంచిశాంతుడ -
నై ముదముదలచి, చెలగెద, నీమహామహిమనుంచి, ఖగ - గామినీ
బలంబునీవుగొంటివి, గాన నేధన్యతముడనైతిని, నీమహానీయదరిశ
నము గలిగెబి, తామహాదుల కగోచరుడవు, శ్రీరామామనోహరు
డవగు రఘురామాప్రకృతికంటెపరుడవు - కామాద్యరివర్గదూరు
డవ. హోమాధవ భవరహితుండవు - కామకర్తగుణవర్జితు డవును
ద, కముస ఫేనజాలములు ననమున-ధూమమెటుల నటులనే యఖిల
మును, నీమాయచే గల్పితంబనె ॥చేరి॥ 3

ఎందాకనరుండుమాయకు, హితవుమీరకుండు, వినువా -
డందాక జడుండు, వానికినాత్మగానరాకుండు, తనయందు గల్గున
విచారమున విద్యమిగుల బ్రబలినదై విద్యనణచు - పొందుగాన
విద్యాకృతమగుటను, బంధుబింబితుండై జీవాఖ్యను - బొందుతను
మనఃప్రాణముల బొందునపుడెస్వాభిమానము - నొందునపుడె సుఖ
దుఃఖముల, నొందునాత్మకు సంసృతిలే - దెందుజ్ఞానమిపుడు బుద్ధికిని
లే, దిది నైజమువ్యాకృతమున బ్రకృతి - పొందుగాను సంసారియ
య్యె హుత, భుగ్వారమేళనంపుక్రియవనె ॥చేరి॥

ఎంతదాకనరుడు, నీపద, హితులపాత్తుజేరడు వినువాడంత
దాకనరుడువలెను భ, వాబ్ధిదిరుగుపామరుండు ఏ - శాంతుడయి
సుజనసంగతివలనను, గనినభక్తిచేతనెపుడునిన్ను న - నంతునాశ్ర
యించినపుడు, మాయకు, నంతమజితుడును స్వప్రకాశుడును -
శాంతాత్మకుడు నైనసద్గురు డంతవానికగపడును సుని - శాంతా
నందమతనిచే గని, చింతలతలనెల్లద్రుంచిని - రంతరాత్మసుఖము
జెందునీపద, రాజీవయుగ భక్తిలేనినరు - లంతమొంది జ్ఞానముక్తి
సుఖముల, నందవశముగాక - చెడుదురనె ॥చేరి॥

ఈశ శరణుశరణు, దురితవి, నాశరణుశరణు, సుజనక్లేశ
హారణ శరణు, జయజయ శ్రీరామ శరణుశరణు నే జేసినట్టి పుణ్య
మెల్ల నీదుమ, హాశుగముననొసగినాడననుదయ - జేసిబ్రోవుమన
బరశురామునకు, సీతావిభుడు ప్రపన్నుడై పలికె - వాసినీమనంబున
నుదలపోసివరముగోరునినుకృప - జేసినానని భృగుకులుడు, భాసిల్లుచు
నీదుపదరజో - లేశమునకు నేవరంబు సమముఖ, లేశభక్తినిమ్మన
గృతార్థునిగ జేసి పనుపజనియె జామదగ్నిని, జేచ్ఛం దనుజరిపు
నుతించుచుజనె ॥చేరి॥

శ్రీతు డయ్యోజాలా దశరథవిభుడంతటలీలా, గుణముల -
చేత నలరిశీలా, తగపురి జేరి చక్రియావేళ, భూ - జాతనెనసి తనరె
ననుజాలునిజ సతులరతుల నేలిరతులవిభవన, మేతుడుజగత్ప్రభుడు
బ్రథితగుణ, జాతుడవ్యయానందమూర్తిసం - గీతానంతకీర్తిసుగుణ,
భూతాద్యఖిలసాక్షిమాయా - జాతాఖిలకలుషహరుడు సాకేతాధి
పుడై యుండె హరిద - యాతిశయత నిదియు జెప్పెసుబ్రహ్మణ్య
కవిశేషగిరీశుపేర వి - ఖ్యాతిమీఱ నధ్యాత్మ రామాయ, ణాఖ్యాన
మున బాలకాండమిది ॥చేరి॥

బాలకాండము సంపూర్ణము.



శ్రీరస్తు

# శ్రీమదధ్యాత్మ రామాయణ కీర్తనలు

## అయోధ్యాకాండము

### 1 కర్ణాటకసారంగ—అటతాళము

పల్లవి—శ్రీసద్గుణాన్వితా శీతాద్రిసుతవినవే - కాశేయ, వాసుని శేషా
చలవాసునిచరిత్రము

అనుపల్లవి—భాసిల్లునంతఃపురవరమునందు మణిసిం - హాసనస్థితుడై
మునిసుతుడై - మహోల్లాసుడై దరహాసుడై శ్రీవాసుడై
శ్రితదాసుడయిసీ - తాసహితుడగు రామునిన్ గనుతల
పూని సురమౌనివచ్చెను ॥శ్రీస॥

శరదిందుచంద్రికాసదృశమా తనుద్యుతుల- మెఱయుచువచ్చు వాని నారదునిగా - నెఱిగి సీతాజానియు దేవీయుతుడయి పొరపొచ్చమింతలేని భక్తిచేమ్రొక్కి - పరగబూజించిమౌని సీదర్శనసం - స్మరణచే విషయాసక్తచిత్తులమైసం-సారచింతమాటికి గలుగుమము బోటికి - దొరకదిదిదుర్లభమునినుగని పరమపావనుడనైతిని భాస్కరుడు రాదమమడగు క్రియనజ్ఞాన మడగుననిమునిపల్కెను ॥శ్రీస॥

శ్రీరామభ్రమయుజేసెదవో ననులోకాను - సారవాక్యముల చేనుసం - సారిననుటిది యురయసత్యమేను జగదాదియారామా - యారమణిగృహిణిగాను - జేయుటనునీసుతులైరి బ్రహ్మాదులెల్లనుత్రిజగన్మహాసం - సారివీవు హరి జనకజ లక్ష్మివురవైరి వీవుసీతహిమశైలజాత - వారిజభవుడవీవుధరణి జవాణిరవివీవు ప్రభజానకి - యారూఢి స్త్రీపురుషవాక్యములన్ని సీతయునీవనియెను ॥శ్రీస॥ 2

స్వామినీఛాయ యవ్యాకృతమనబడునది-యేమూలప్రకృతి దానమహత్తత్త్వమా మహత్తత్త్వానలింగశరీరమై-మఱియది సకల మైనతనువుల జేసెన - హంకారబుద్ధి ప్రాణాజ్ఞానకర్మేంద్రియ - సాము దాయకములింగ-శరీరమనబడునదే జన్మకర్మమూలముఇంద్రజాలము ఆమహాత్మయెజీవ - సంజ్ఞనవాద్యవుదోర్యపాధినొందిన ద్వైవించెష్టా లాదిదేహ - త్రయమెజీవోపాధియనియును ॥శ్రీస॥ 3

స్థూలసూక్ష్మకారణాల జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలు మూడు గగ్గెనీసంసృతి - లీల చేసెఃయువాడు జీవుడెపరమాత్మత్రి-కాలసాక్షి యీరేడులోకములకాది - మూలమదినీవేమూను మాయాభువన - జాతములు నీయందె జననస్థితిలయములై జరుగుచున్నవిరామా రాక్ష సవిరామా - వ్యాళమనిత్రాడుగనిబెదరిన, పోలికనుడను జీవుడను కొను బాలిశుడుఘనుడాత్మతానని భయరహితుడయి యులరునని యెను ॥శ్రీస॥ 4

ఏనీతేజమునసీయఖిలమును వెలుగునిదిఖలుసు తెలియలేక - దేహమేపతి యనియెంచు పుణ్యశ్లోకయెందాక - జ్ఞానము తెగిపోక యుండునందాక - దీనుడగుజనుకునీకారుణ్యమున విజ్ఞానానందమొద విననలుడౌనది నీపా - దారవింద భక్తినిగలుగునదిముక్తిని దాస మగు రామనీదాసుల దాసుడను కరుణనుబ్రోవుము - నీనాభికమల జాడు మూతంద్రీ యటుగాననేపౌత్రుడనని ॥శ్రీస॥ 5

అనిచాలా ప్రణతుడై యానందబాష్పములు - కనులజడిగొన జడదారిరఘువంశతిలకుని - వినుతించెవేడ్క జేరి రావణవధార్థము - జనియించినావుశౌరిదశరథుసు నిన్ను - జనవిభునిజేయుగోరి, యున్నా డటులయిన రావణుడుజచ్చుటెటు లతనిజంపుదు నని ప్రతిజ్ఞజేసినా మునుడాసి - విమము భూభారహరణమునకు, మెునయుమిదివన

భవ్యవాక్యము - వనిజముఖనగవు మొగమునజిగి, బెనగొనగ ననిమె
రాముడు ॥శ్రీ॥

వినునారద నేనెఱుగని దేమియును లేదు - మునుప్రతిన నాచే
తనెటు జేయబడెనటు-లనే జేతు సకలభూతముల, సుఖాసుఖములు -
ఘనకాలసంజా, తములు ప్రారబ్ధ - మునననుగుణవిభవన నే, తనైత
గులక నేనే - నెనసివినోదింతువిదె రేపుదండకాటవి కేగి-మునివేషము
దాల్చి సంతోషము - నను చతుర్దశ వత్సరములుందును సీతయును
నెపమునను రా - వణునిసబలముగ జంపుదుననవిని దేవగతిజనె
మునీంద్రుడు ॥శ్రీస॥

2 పూరికల్యాణి—ఆదితాళము

పల్లవి—వినవేసుకవాణీమాణిక్య, వీణావాదనపటువాణీ॥

అను—మనువంశ్యుడు దశరథుడంతట మం - తనమునవసియిం, చి
వసిష్ఠుని ఘనముగ రావించిమన్నించి-వినుమనిపలికెమహాత్మ
నిఖలజను - లును మాటికి వాగడెదరు శ్రీరాముని - ఘన
గుణాభిరాముని యువరాజును, గానొనర్పవలెనిపుడె భరతు
డను - జుని గూడిచనెను మామనుగను, గాన శుభదీక్ష
నునుపు రాముని రయముగనని ॥వినవే॥

వరమౌని దశరథునివీడ్కొని రఘువరునగరికివేగ రాగా శ్రీ -
వారియెదుర్కొనిబాగా వసిష్ఠునిపరగ సత్కృతులుగాగా జేసి సీతా
తరుణిహైమకలశోదకములొసంగగ-గురునియడుగులుగడిగి, శిరము
నవ్వారి-ధరియించిసేమమడిగి, పూజించినీ-చరణనీరజధారణ, ముగ
గృతార్థుడనై - మెఱసితిననుదా, శరధిపలుకువిని - చిఱునగవు
దొలకగ బలికెమునునీ, చరణజలముహరుడు శిరమునందిడి - పరమ
పురుషుడాయెమూతండ్రి నలువయునీపదాంబువులసుఖయయ్యెననెను
॥వినవే॥

ఇటులనదగు నేలోకగురుడవని, యీశుడవనియు రమాపతి వనియు సము - త్కటయశుడవనియు బరమాత్ముడ వనియు నిన్ను - కుటిలులకెఱుగవశ, మాభక్తపాలన - చటులుడవై భూభా, రము మాన్పరావణుని జంపగమదినెం, చిపుట్టితివని దిటవున నిశ్చ యించి, చినామనేను - అటులైనబహుగోప్యము జేసితిని, వెటులమా యచేసర్వము జేయుదు - వటులనేగురుడవనిశిష్యుడనీ, వనుచునటన సల్పితిసామిజగ - న్నటనసూత్రధారియఖిలభూతాం,తర్యామియవన్ వెలయువనెను దపసి ॥వినవె॥

నీవు శుద్ధసత్త్వమయమైన మేనునెరిబూని భువియందు మా యామనుజ - భావమున జెలగుచుం, దువకటరాజ - సేవగాసిజెం, దుపౌరోహిత్య-జీవనమతినిందితమనిం దెలిసియు - నీవురఘువంశమున జనియింతువని - భావించిసంతసమున నీకుగురుడనై - యేవేడుకకిది నే నియ్యకొంటినాతపమిప్పుడు ఫలియిం, చెనన్నికనీమా - యావిభూతి కగపఱుపకుదశరథ, భూమివిభుడు నిన్నుపట్టముగట్ట శు - భావహు గమ్మనెను సీతతోడీ, ఉపావసినుండుమని చనియె వసిష్ఠముని ॥వినవే॥

శ్రీవిభుడు లక్ష్మణునిగనినన్ను యువరాజ్యాభి, షిక్తుజేసె దరు నేనుసాక్షిమాత్రుడను-నీవెసకలము బూనుకర్తవు, భోక్తవు, నీవే నాప్రాణములు మేనుసుమ్మనిపలికె నావేళపౌరజనులు రాముని యువరాజ్య శ్రీవినికడు హెచ్చిదశ, రథునిమెచ్చి-యావార్త లపుడె దెచ్చి కౌసల్యా - దేవితోసుమిత్రాదేవితో దెలుపవార - లావా ర్త్యాకర్ణనమున సంతోషపూర్ణ - లైవెలసిరిసురలు, సరస్వతిగని, దేవి నీవయోధ్యకు జని విఘ్నముగావింపుము రామాభిషేకమున, నా విబుధ ప్రార్థనకియ్యకొనెవాణి ॥వినవే॥

కోమరారుకైకనగరవాసియొకతె, కుంటిదిగూనిదిగుజ్జురూపుది మిడిగ్రుడ్లుమిడిబొమలు డొంకుమైగల, ది యయోధ్యలోను రమణు

లకు, నవ్వులాటది మందరయను - కుమతియొక్క తెగలను భారతి
దానిజెంది, కుదురై యుండె నంతఃపురి శృంగారముల - నమరియుంత
యువిం, తమైయున్న జూచి - భ్రమసి మంధర తొందరతో వచ్చి
కైక రేపు రామునకు పట్టాభిషేకమనినకైక-ప్రముదమొదవిబంగారం
దెలొసగ గాపడతియొల్లకిది భయశమయము సుఖనియమముగాదబల
శేషశైల, స్వామియైన రామునిశుభము నీకనెను ॥వినవే॥ 5

3 తోడిరాగము—అటతాళము

పల్లవి—సరసగుణమణిసన్మందిర, సఖికృతేందిరా, వినవే॥

అను—గరిమమున రాఘువుని యభిషే, కమహోత్సవము శుభమన
కభయా - కరమనుటయేమిశ్రీరాముడు కౌసల్యగానను జూ
చునను - పరమసమ్మతములైన కైక, వచనముల్వినగ
జాలక మంధర నీసుతునకు నీకు సుఖము, దలచినాను దా
యగాను దలపకు ॥సరస॥

కైకవిను భరతశత్రుఘ్నుల, కేకయపురికనిచి నీకాంతు -
డోకాంతయేకాంతమున నీ, తాకాంతు ధరణీకాంతుగాను - ప్రాక
సైశ్వర్యమునకెల్లను, పట్టభద్రుని జేయదలచెను, నీకునీతనయునకు
దాస్యము నియమించునొకయుపాయమున్నది, నీకురాజు దేవాసురాజి
నిచ్చిన, వరములురెండుగలవు, నీకొడుకు దొరతనము రాఘువునికి
వనవాసమును నానసేయుమనె ॥సరస॥ 1

ఈవిధమున మందరపలిన, హితవనితలచి సఖిని మెచ్చుచు
నావనితధీరజనితకోపమునను మాసినచీరెగట్టి వెసనుతీవిగ యుడిగి
భూషణములన్నియు బాఱవైచి యలుకయింటి - లోనొంటిగానేల
బడి, పొరలుచుండెను దయగలవాడైన - పావనుండయిన, ధీరుడైన
దేవసముడయినగాని కుజని - తావినోదమును వీడదేని తద్గుణానుసారి
యౌనునిజమిది ॥సరస॥

అంతటనుదశరథుడు కైకగృహంబునకుజని నిశ్శబ్దమై- కాంతి
చెడి భ్రాంతిపడిమెలగెడి, కలికితండముగని కలగివిభుడు - యింత
వింతయి దేమియన జెలు, లెఱుక, మాకైక యలగినయది - సంత
సము సేయుమనవిధియా, దంతిగమనను డాసి నీకీ - చింతయేమిటికి
కైకనీదు, చిత్తమెటుల జేతునని - శాంతమోహమునను పా
దములకపుడు నృపుడు మ్రొక్కి దక్కి నానన ॥సరస॥ 3

పలికినాకనినాడువారలు, ప్రాణేశమునుపునా కొసగిన - యల
ఘువరములకు భరతునిరా, జ్యాధిపతిగా రామునికానలో - వెలయ
బదునాల్గేండ్లు మునివై, నిలువ సెలవీయు మనుచు కైక - పలుక
విని వజ్రహతవృక్షము చెలువునను భువిబడియంతలో - దెలిసి చెడు
గుకల గంటిననుచు దలచి వెడగు కలకంఠినెదుట - పులినలెంగని
తిరుగమూర్ఛిలిన, చెలులు బోధచేసిరాధ రాధిపు ॥సరస॥ 4

భార్యగావునీవుశత్రువునా, పాలిటినీకు రాముడు- పరిచర్యయా
శ్చర్యముగసల్పును, సతి నీవు రాముని మెత్తువెపుడు-ఆర్యసమ్మతుని
బొమ్మననే, నతివరాజ్యముగొమ్మని నృప-వర్య బొంకిన నరకమున
బడువాడవని కైకపలుక దశరథుడు కార్యమేమనుచు వనటనొంది,
కందియుండెనా రాత్రిచనిన - సూర్యోదయమున దార్యత్రిక, సుభగ
నాదశుభవినోదములెసగ ॥సరస॥ 5

ఛత్రచామర తురగకరిరథ, సముదయముగనుపట్టభూషిత, -
గాత్ర నిపవిత్రుని నవిత్రా పుత్రయుతునికరీంద్రారూఢుని-జైత్రాతప
త్రాన్వితునిరామ, చంద్రుగనిజను లలరియుండిరి - ధాత్రీశు డేమో
రాడనియుత్తజి సుమంత్రుడు చని మ్రొక్కి హా - పుత్రలలామహ
రామ యన పొగులు రాజుగని కైక నడుగ - రాత్రి నిద్రలేదిల
నికి శ్రీరాము సుగుణధాము దోడితెమ్మనె ॥సరస॥

దశరథాజ్ఞను సుమంత్రుడు జని, తగ రామవిభుదోడి తెచ్చిన-శశివదను డసితతనుడగు రఘుసత్తముడు తండ్రికిబ్రణమిల్లెను - బిసరుహాక్షుని గాగిలించుక పృథివీశుడేడ్వగ వసిష్టుడు - మనలకనువచ్చె రాముడిదే, మనకైకభరతునకు రాజ్యము అసద్భ్రశాటవికి నిన్ను బనుప, నడిగినానని పితృవాక్యము - విసువక నడపెదవని శేషగిరి శిఖరాలయుడు విశాలమతియై ॥సరస॥

### 4 ఆనందభైరవిరాగము—అటతాళము

పల్లవి—వినవేపల్లవమృదుచరణాకరుణా, వితరణగుణాభరణా॥

అనుపల్లవి—జనవిభుడానతి, చ్చినదండకాటవికి - మునివేషధారివై
చనియెద ననవిని, యనఘ రాఘవ కాముకుడనై యతివవల
నను జిక్కితినినిను - వేనమునకుననిచి ప్రాణము లీతనువునను
మానవనెను భూపతి ॥విన॥

రామాజగదభిరామాసుబాహువి, రామాకులల - లామాహా హైమవతీచింత్య, నామ హాభీమోద్దామసం - గ్రామహా శ్రీమహిత ముఖజిత, సోమానిన్ను - నేమనిపొమ్మందు, నెటులనోర్చియుందు యీ మోహాబ్ధికిగట్టు, యేదని విలపింప, నామహీపతినడలవలదని సౌమిత్రితో దల్లినగరికి - స్వామి చనినతితి సుమిత్రాకౌ, సల్యలకు సేయదీవించిరి ॥విస॥

అనువందవనభూమికరుగ గార్యమువచ్చె, నమ్మాసెలవిమ్మా యనిన - వినిహామ్మసిల్లి యాకౌమ్మహా, వనజాక్ష ననుజేరరమ్మా రాజు - నినుబొమ్మనుట నిజమ్మాన మ్మ - నన నగుచుకైక, తన నందనునిదొరనుగా - ననుపదునాల్గేండ్లు, వనమున వసియింప - జన విభునివేడె బితృవాక్యమున, మనుపజనియెదనన భరతునిక - వని యొసంగి తనయునిచటనె నిలు, మనుచు, గౌసల్యవిలపించెను ॥విన॥2

కైక యెవ్వరుధరణి, కాంతు డెవరుచూడునా - ధాకపరాకా
కైక నీకై కడిగిదివిజా, నీకములు - డీకొనిన ద్రుంతుపో, నీకరాజ్య
శ్రీకినిపట్టాభిషేకమిపుడు ప్రాకటముగ జేతుభరతుడల్గిన నతని -
గేకయులక్రుళ్ళడ, గింతు ననిలక్ష్మణుడు - వీకమైబల్కరాముడువిని
నీకడిమియును నీదుభక్తియు - లోకములకెల్ల దెలియునువ, త్సా
కైకపై యలుగవలదనె ॥విన॥ 3
జడమునశ్వరముయీా, జగము రాజ్యముతనువు, సత్యమా
యిది నిత్యమా ఆస, పడ భోగఫల, మాన్నత్యమా, కలిమి - పడతి
చంచలసుజనస్తుత్యమాభ్రాంతి - యుడుగకుండుటస, త్కృత్యమా
మాన - వుండసుఖమునకుకర్మ, మొడిగట్టితనకంటె - నొడలువేఅని
తెలియ, నుడుగుకోర్కెలుతృణతతి - నడియేటగూడియదసినక్రియ,
మాతృపితృసతి సుతహితాదుల - నడకయిది స్వప్నసమమనియె,
న్నకజడుడు కోరుననె రాముడు ॥వినవే॥ 4
ఆయునల్పముజరావ్యాధులు పులులవలె, డాయదెలియడా యన
రుడు - ఈయఖిలసుఖములు, హేయమనడు-మాయురేఖగవన్మాయ
దేహ - యాత్మయనుకుమతి ఛాయామాత్ర, మైయస్థిత్వజ్మేదోమ
జ్జాసృజ్మాంసని, కాయమాకాయమె, ట్లాయనాత్మ చెపుమా - యీా
యాసవిడువు మహామికభ్రమ, హేతు విదియయవిద్య నేనన, పాయ
మగుసచ్చిదానంద, బ్రహ్మమనుటిదివిద్యయనెహరి ॥వినవే॥ 5
మొదలుక్రోధము పాప, మునకు మనస్తాపమూలము ఇంద్ర
జాలముక్రోధము - సదయాత్ములకు ప్రతికూలముక్రోధము - హృద
యగ్రంధికి నాలవాలముక్రోధము - విదితధర్మములకు, శూలము,
మదియుం దదియుంచకనునినునీ, వఖిలసాక్షిగానెంచి - ముదమున
సుఖయింపుము యీాజ్ఞానము - మదయుతులకివలదులక్ష్మణ, మర్మ
మని తల్లికీత త్వమె - సదయుడై తెలుపగాగిట సుతు, గదియించి
పోయిరమ్మనెసతి ॥విన॥ 9

హరిసుమిత్రకు మ్రొక్కి యన్నలక్ష్మణనిలువు, మన్నమనసు వెన్న - కరణికరుగ బల్కెనీకన్నమునునే - నరిగెదనురాన్నీ, కన్న జత్తు - పరమేశ్వరునిన గడుజెన్నారంగ - కరుణించి యనుజూరాకకు సమ్మతించియూ - ధరణిజను జేరినే దండకాటవి కేగి, తిరిగివచ్చెదనిలువుమననీ, చరణములయాన వేనిలువను - బరమాత్మయనిన శేషాచల, పతియతివతో గూడికదలెను ॥విన॥

5 యదుకులాంభోజి—ఆదితాళము

పల్లవి—చికురనిందితాళీరణకేళీ జితమదాసురాళీ నిలయీకృత - సకలభువనపాళీలలనా, జనమాళీ కాళీవినవే॥

అనుపల్లవి—సకలరాజన్యులు రాజను భా - నుకులరత్నమువిభవము నుడిగిజ - నకసుతాలక్ష్మణసమేతుడై, వికసితాంబుజలోచనుడై చను - టకు, గతమేమని తండ్రియాజ్ఞనడ, వికిబోవుచెటిగి పురజనులుపొగల - నకటవగవకుం డనుచువారితో ననియె వాసుదేవు కన్నునీంద్రుడు ॥చికుర॥

ఈరాముకు నారాయణదేవుడు, ఈశుడవ్యయుడు మహానుభావుడు - శౌరియోగమాయసీతమయ్యను కోరిశేషుడేలక్ష్మణుడయియులరెజను - లారా బ్రహ్మవిష్ణురుద్రా, కారమైబూనిగుణత్రీ - మీరజగముదయస్థితిసం, హారములు జేయుఘనుడు హరి - ఈరాముడు మత్స్యకూర్మసూకర, నారసింహవామన భృగురామశ - రీరములు దాల్చియిపుడు దశరథకుమారుడయ్యె ఖలులజంపుటకునసె ॥చికుర॥

రావణాదిదుర్జనులవధార్థము, రాముడుద్భవిల్లుట ఈయర్థము దేవమునిదెలిసిపలుక నతనితో దెల్పె రేపువనికేగెదనని యితడుధర - వల్లభుడు గై కహరిసటవీవాసమున కనుపలేదిత - డేవారల నిట

నియమించెను, దైవాధీనము సర్వజగము - గావునమీరిందుకయి యడలకు, జీవనజోదరు హృదయపద్మమున - భావించిన జింతలెడలు ననిముని, పలుకబౌరులలరి హరినుతించిరి ॥చికుర॥

ఆమీదట రాముడుకైకనగరి, కరిగియడవికేగమోకుముగురికి భూమిపతియాజ్ఞగొనుమనిపకైక, దీమశముననిచ్చె నారచీరెలు, అవి సౌమిత్రియు రాముడుగట్టిరి, భూమిసుతఛీగాదన్నను, స్వామిజనక జకటి జుట్టెను, ఏమీయనలేక నృపభార్య, లీమానవతికీచీరెతగదని యేడ్వగ వసిష్ఠుడదరిపడికైక, నీమది చెడసీత కదియొసగదగు, నే యని దుకూలములవనిజకొసగె ॥చి॥

రాజుసుమంత్రునిచే గుమారులకు రథముదెప్పించనపుడె జనకునకు శ్రీజానిసలక్ష్మణుడై మ్రొక్కెను సీతయు దరికి మ్రొక్కియు రదమెక్కెహరి జేజే లలరగ తేరెక్కెను, జేజేయనిప్రజలు బొగడ నహో, తాజేయుడఖిలసాధనములు, తాజేకొని సుమిత్రకొమరుడు రాజిలురణమెక్కె సుమంత్రుడురథ, రథ్యములనకుప నిలుమని దశరథ, రాజువిలపింప దరిమినడచి జన, రాజితోడ దమస దాటె రాముడు ॥చి॥

పుడమిజే డవనిఱ్ఱైబడిపుర, పురబొక్కి పౌరలియేడ్వభృత్యులధిపుని, యడవికౌసల్యనగరికిగొనిచని, రాయువతివిభునిబోధింపుచు నుండె న, క్కడరాముడు నిల్చి జనుల నిటు, విడరారని పురికిరథముగొని, వడురాతిరి సుమంత్రుబొమ్మని, యుడురాజని భావనయును నను, జుడుగూడి నడువనపుడెకదలిచని. సుమ, హత్తరంగకలికలుమ భంగ మృడ జటాజూటసంగ గంగగనిమెచ్చుశౌరిజేర గుహుడు వచ్చెను ॥చి॥

చరణకమలయుగళికి బ్రణమిల్లెకు యెఱుగవాని రాముడుసుధ జల్లెడు, గురుదయాదృష్టిగని కౌగిటనిడు, కొన్నబొగగుహు డుభక్తి

చ్యుతుని - హరిధరియించె జటలుమునినై వని జలియింతుననుచు లక్ష్మణుడును - ధరియించెను సత్యవ్రతుడని కురియించిరి విరులు సురలు శ్రీ - ధనుడు గంగనీటగ్రుంకి జలములుద్రావి తరుమూలమున బవ్వళించె - వరుణితోడ నట రామచంద్రునా, గరులగాన లేక పురికిబోయిరి ॥చికుర॥ 6

మాయామానుషవేషధారి తృణశాయియై నిదురవోవగధను స్సాయకములు బూని గొలిచియుండెను సౌమిత్రితో నిషాదవిభుడు పలికె దృఢ - శాయి శ్రీహరినిటుగని కనుదోయిసంతోషింపకున్నదోయి ఈదుఃఖమునకుకయి, కేయి హేతువుగదాయనెను-మాయిక ముసుఖాసుఖమునోడలు తమ, కేయెడ లేదని లక్ష్మణుకుశర - నాయకునకు దెల్పగ నరుణోదయ, మాయె శేషగిరిపతియు మేల్కొనెను ॥చికుర॥ 7

6 భూపాలము—అటతాళము

పల్లవి—సఖీమణి వినవే నీవీ సచ్చరితము సలలితానం, దదాయక, మనవే

అను—సుఖాఇడశుభసుషుప్తిదేరి, ముఖాబ్జశాంతి పొదలరఘుకుల - శిఖామణిగుహసీతానుజుల్, సేవింపస్నాతుడై సుప్రీతుడై లస - దఖండమగు రోడ నెక్కియమ, రాపగగడచి గుహుని బిలిచి సఖాపురికిబొమ్మనుచుబనిచె, సదయుడై ప్రయత్న పూర్వకముగ ॥సఖీ॥

మించిరాఘువులు మృగమునొకటి, వధించి పచనముమంచిగాగా - వించిముగురుభుజించియచటవసించి మేల్కాంచి, మరునా - డంచితగతిధర్మాత్మజతాను, దంచద్భరద్వాజాశ్రమము, గాంచిమునికి తమ, వేంచేయు టెఱిగించ రాబంచి హర్షించిరమ్ముని శిష్యు చేన్నృప పంచాననులు వచ్చుటదెలిసి; చంచదర్ఘ్యము, గొంచెడురుచనీ, చక్రి రక్షించి తనువుపుల కించనుతియించ మునికనఘులు నమస్కరించ

కౌగలించి రామునిపూ - జించెను శ్రీరామునిస్మితముఖజితసోముని జగదభిరాముని ॥సఖి॥

నాదబిందుకళాతీతజగ - దాదిపురుషమహాత్మవినుసీ - పాదరజమున బ్రోదిసేయుము నాదుమందిరము అనినముని - నాదరించి తదాశ్రమమునవి, నోదించి తదనుజ్ఞసుజ - నాహ్లాదివాల్మీకాశ్రమము శ్రుతినాదబంధురముగనిముని - పాదములకు నవనిజానుజుల, తోడవిలి ప్రణతుడై యులరు మ - హాదేవుని సుమాస్త్రరుచిరుని, నబ్జదళనేత్రు రమాకళత్రునిశ్రిత - మేదినీసుతాలక్ష్మణులా వాల్మీకిగాంచిగారవించి పా-ద్యాదివిధుల నర్చించిఫలములర్పించి భజించి హరిపలికె ॥సఖి॥

స్వామి వినునవభూమి దశరథ, భూమివిభు పంపున జరింపగ మేమువచ్చుటమీకుదెలియని, దేమియున్నది నేనుయీమానవతితో మెలగియిచట శ్రమించునది, నేమింపుమని రాముడుపలుక - నావహాని యఖిలార్థసంవేదినై ప్రేమచేబల్కె- భువనమునకు - రామ నీవే నిలయమనినీకు ధామమిది సాధారణమను త్తమమైనదే - వామహాను భావావిను మేమహాత్ములతిశాంతులు సములిచ్ఛాసూయావిరహితులు నీ-శేముషిగలవారిమది నీకు శ్రీయుతముగనిలనునికి యనెను ॥సఖి॥

శమదమదయాసత్యములుగల, సునుతులెవ్వరు శుభాశుభములసమయములహర్షవిషాదముల, భ్రమయరెవ్వరు సుజనబృం-దములగూడి ధర్మాధర్మసమరమున వీడి మది నిను శరణమువేడి గర్వము దిగనాడి మమతగోరాడియెవ - రమునులయితనరాదురు యెవరిమితధృతి శ్రీరామనీమం - త్రముజపింతురు ద్వంద్వరహితుల యితజనులస్వాం - తమునిశాంతము నీకువ - ద్వారిమతవదూర్మిషడ్వనములకుమీతి యవలవెలుగునినుదే - హముగ సర్వగతునిగనొకగని, నరయుజనుల మదియిలు నీకనె ॥సఖి॥

అనవరతయోగా, భ్యాసబలమునదృఢీకృత - మనస్కులునిను ప్రతినిమిషమును, గనుగొనుచునఘులయిమించు - ఘనులహృద్వన జమున సీతాయుతుడవయి, మొనసి విహరింపమదియనీకు నన్నుడైన తావునినువర్ణింపజాల, నంచుబలికివనజాతునీప్రభావముచే, ననువంద బ్రహ్మఋషి నయితిని - జనమాత్రమే తిన్నామరుడను నిషాదపురి జెరిగివిలుబట్టనెటిగి బో - యనెలత నొక తెనెనసికొడుకుల, గనినే, వారి బ్రోవజీవుల - మునుమిడియమునివలెనెజంపుచు ముచ్చులతే, డననెగడితి ననె ॥సఖి॥

ఈగతిచరియింపనస్త ఋషు, లాగమవేత్తలరుగవారల - సాగి పోనీకాపివనిరి, వేగనీవరిగి నీసుతుల - నీగరితలను నెమ్మిబిలిచి భోగఫలముల పొల్కిదురితము - భాగములుగొమ్మనివారి, నాగరిక మెటిగిరామా - తోగర్వమెందుకనజనినే, నాగరినతడుగ నాలుబిడ్డలు - మూగియడవిచిన మొఱకునయినురలి, యోగివరులనుగని యది దెలుపవినికడు - రాగిలియుపదేశమిచ్చి వారలజనను రామరాయ నివి-రాగినై జపించితివిపుట్టలు, ప్రబలెనాదు తనువుననెముని ॥సఖి॥

అంతట బహుసహస్రాబ్దములు, పంతముననుదపంబుసేయగ-దాంతులగుసప్త ఋషులువచ్చి, దనరనను - దెలుపభానుడు - మంతు మీఅదనమునడంచుక్రియ, వింతగావల్మీకము వెడలి, సంతసమునను సంయములగని; సద్భక్తిసలుపధీ - మంతుడవు బ్రహ్మఋషివైతివి, వంతదీతెనువాల్మీకి యని - యంతర్హితులైరింతయును శేషాద్రీశనిను మదినుతియించుఫలమిదియని-కొంతబాగడిసురనదికిచిత్ర, కూటగిరికి నసుమగృహము ముని - కాంతుడు రచింపసీతా, లక్ష్మణయుతుడై హరియుండెనచట ॥సఖి॥

## 7 అసావేరిరాగము—ఆదితాళము

పల్లవి—హృద్వనజార్చిత రామాయా, శ్రితజనకల్పారామా సద్వచో
భిరామా రామా ॥వినవే॥

అను—అద్వయముగమంత్రుడగదముగొని, యయోధ్య కరిగి, దశ
రథునకెజగిర - ఘురూద్వహుడు జానకి లక్ష్మణులనుగూడి
గంగకావలజననృపుడు - విద్వన్నుతరామచంద్రసీతా, విభో
జగత్ప్రభోవిధాతనినుమ - హాదైన్యభవానుభవయోగ్యనడవి
నడలవ్రాసెనాయని యడలెను ॥హృద్వ॥

పుడమిజనులు నినుదయగలవాడని, పొగడక వైకల్యమేటికి - అడరినీదుకోరికలన్నియు నేడకటా సాఫల్యమాయెను - వెడవెడయే డ్వక యుడుగుమనుచును, కీశుని గౌసల్యదూగిన-నిడుదకన్నులనీరొ డియు నతినికా, నుడికెహృదయశల్యమాయెను - నిడుగుబడినవాగి కొలవిజూచిన, నడుపున నేచెదుప్రాణముల్నిలవు, పడతివినుము పుత్రశోకమునదనువు. వెడలు ననుచు నొకమునిశిట్టెదొల్లి - కడకనే నునని వేటలాడముని, కొడుకొకడు రేయినదిఘటముముంచ - బుడ బుడమన గజమనిశరమేయన, తడు హాయతి సనె జనపతి ॥హృద్వ॥

డాయజనియయోయనినేమునిపడ తోయజములు దడవియో ముని -నాయక నేనపరాధిని దశరథ, నరపతిననినుడివి మ్రొక్కిన - నాయకవేదనకోర్వలేనునా, జననీజనకు లడవినొరలెద-రామెడకేగు మువైశ్యుడననివశ - రమ్మనెరికినిడివిసేయక- తోయముగొనిచనిహా కుమారకా, హాయజ్ఞదత్తాయని జీరువారి - కాయతదుతివల గొసియు డక మొసగి యయో, ధ్యావిభుడను దశరథుండ దంతి - నేయుమీ తనయు డీల్గెననసీవు, మాయటులెసుతా నెడసినపుడెచని - పోయెద వనిగెడస్థిరని దెలిపిమృతు, డాయెహరిహరీ యనుచున్నపుడు హృద

యమును మోదుకొనియహో యనికౌస, ల్యాదిముదితలు విలపింపవసిష్ఠు డాదయితలవారించి శవము, తైలముచే గ్రాగింపబంచటు - మీద భరతశత్రుఘ్నులబిలవనం, పినత్వరదీపింపవా, రేడోదిన మే వచ్చి యయోధ్యగనిభయ, ఖేదములుజనింప బురజను - లాదరింపమియు గని యిదేమోయని, యంతిపురికేగి కైకకుమ్రొక్కిన మోదమొద విసుతుగాగిలించిన, పుట్టినింటిసేమమరసె భరతుడు మేదినీశుడేడని కైకనడుగ విని సీతారామలక్ష్మణులనీ - మీదిదయచేనడవికనిచితి మృతుడాయెనాలసె నతడు ॥హా॥

కొంతవడికి సేదదేర భరతుడు కోపదృష్టినిజూచికై కాశాంత మూర్తినిగృపాళుని శ్రీరామ, చంద్రునడవిద్రోచిభువిపతి - హాంత వైతివయయోనరకము నందుపడెదవేఛీయనినే - నెంతపాపకర్మికి కొడుకైతి, నింకేలనులేచిపోయి - కాంతుబాసివనరెడు కౌసల్యను, గాంచి పాదములపైబడియేడ్చిన - చింతయేమీనీవు కైకకరుణను, శ్రీమంతుడవైతని జననిపలుక - యింతకైకకృత మే నెఱిగినగురు హింసజేసినట్లన, గౌసల్యా - కాంతనతయు కౌగిటనిడికొనియూ, క్రందించె మహారవమెసగగ ॥హా॥

అపుడు వసిష్ఠుడువచ్చి భరతుతో, ననియె వగచుటేలా దశ రథు - డపరిమితసుఖములనుభవించిదివి, కరిగెజ్ఞానశీల జీవుడు - చ పలజన్మమృత్యురహితు డమలుడు, శాశ్వతుడుత్రికాలాబాధ్యుడు కపటశరీరమె జడ మనృతమిందు, కైవికారమేలామూఢుడు - అప విత్రమైన సంసారదుఃఖా, హతుడై బాంధవులు డెగిరనిపొగలు-నిపు ణుడు జీవితము చిగురాకకొన, నీరబి దువునుగా దలగినను కృపచే నెఱిగింప నృపునితను వ, గ్ని చేదహించి క్రియల్ జేసినోద - రవు న్సరుడై భరతుడు శేషగి, రి పతిరామునిన్ జూడదలచె ॥హా॥

మంగళకౌశిక రాగము—అటతాళము

పల్లవి—ఎలమిచే సేవింపవే. శ్రీరాముని - చెలిమిచే భావింపవే - యో లలనా॥

అను—సలలితముగ రామ, చంద్రుని శ్రీపాద - జలరుహానిష్యంద, సద్భక్తిమకరంద ॥ఎల॥

భరతుడామీదట బంధుమిత్రమంత్ర - వర సేవాపరివృతుడై కోసల - పురికి హరిని దేనుద్యుక్తుడై వసిష్ఠాది గురుసజ్జనాన్వితుడై కదలింగంగా - సరిదమలపులినాంతరములవిడిసెన చ్చెరునందిగుహుడు పరమపావను డేని, సురనది దాటింతు, హరికివంచకు డేవి, యరుగనీ నవివచ్చి - భరతు రామసేవా, నిరతు రాజ్యకాంతవిరతు గనిమెచ్చి యర్పించె కానుకలు మ్రొక్కి ॥ఎల॥

కూరిమిభరతుడు, గుహునిఃసుహాసుహుని - సారె గౌగిట నుంచియచ్యుతు చెంత - జేరినట్టాత్మనెంచిమెచ్చటనీవు. శౌరిని బా డగాంచినావనియతని - చే రాముడు విశ్రమించియున్న చోటాగని తిలకించి మ్రొక్కియచట - నారాత్రియుండిమఱునాడు ప్రొద్దునభా గీరథిదాటియరుదార భరద్వాజ - శ్రీరమ్య చరణరాజీవములు వల గొని, యారూఢితావచ్చుటంతయు దెలిపిన - త్కారములతని చే గాంచినాడచట శ్రీ - మీరనిల్చిముని చేదారిదెలిసి వేగ, శ్రీరాములు డెడి చిత్రకూటము జేరె ॥ఎల॥

బలములభరతుడి, మ్ములమనిచిగుహుశత్రు - ఘ్నులురావ చితనమై, పులకలునిండ దిలకించెమునిధనమై, ఫలకుసుమను - ట్మ పాళిఘనమై, శాఖశాఖా - విలసద్ఘనాఘనమై, మయూరకో- కి కీర సేవనమై పానసమై శ్రీయలరునావనముపరిహాసి, ఆనందనమచ ఫాల - కులిశధ్వజనీలాబ్జరే, ఖలచాలుభూలుపొందుసీతా రాములపా

ముద్రిత - స్థలులుగనిహర్షాశ్రుజలము కన్నులార, ఫలియించెనాదు
కోర్కెలునేధన్యుడనై - వెలసితి నని యెంచి వినుతించిహరియున్న
నిలయము శుభలక్ష్మి, వలయముజూచెను ॥నెలమి॥

వెలిదమ్మిరేకులగెలుచుకన్నులవాని వెడదయురమువాని నల్ల
నివాని - మొలకనవ్వులవానిసీతాలక్ష్మ, ణులతో గ్రీడించువాని
నారచీ. రలజడల దనరువానినీరేడుజగ, ములనేలినవాని రాముని
జూచి-సలలితభయభక్తి, సంభ్రమాద్భుతముల - వలగొనితత్పాదన
లినములపై హస్త - ములుజేర్చి సాంష్టాగముగ మ్రొక్కికనులనం -
గుళము లొత్తుచు మేలు, దలచుభరతునికృపా - కలితదృష్టిగాంచి
కౌగిలించితొడల నెలకొల్పెగుహాశత్రు - ఘ్నులునతులొనర్పగ లలి
తుండు దీవించి వెలలేనిచనువిచ్చె ॥నెలమి॥

స్వామికౌసల్యాదిజననులురామ్రొక్కి, వసిష్ఠమునిగాంచిపూజ
చేసి భూమీశునెచ్చరించి, సేమమడుగ, నీమీది మమతమించి దశర
థుడు ని - స్నేమదిలోనుంచి దివికరిగెనన, వేమూరుశోకించి గంగా
నదికి - రామ లందఱు వెంటరా నరిగిస్నాతుడై - బ్రేమదిలోదక
క్రియలుదశరథునకు సౌమిత్రియుదాను, సల్పికృతకృత్యుడై నేమ
మునచాదినము నెరవేర్చి మరలి నిజ - ధామము జేరిస, త్ఫలము
లందఱికొసగిశ్రీ, మీరమన్నించె శేషగిరిప్రభుడౌ శ్రీమహిళావిభు
డీలీల వినోదించె ॥నెలమి॥

జుజావంతి—ఆదితాళము

పల్లవి—వినవేదశేదరపిండదళసుందర - విశాలలోచన నిజకింకరజన
భయమోచన॥

అను—మనుకులతిలక అయోధ్యపురమ్మున, మాపతివై మమ్ము బ్రో
వుము ఘనయాగముల జే, సి సుతుల గాంచి-తనయులరాజ్య

మును, న సునిచిపిమ్మట, వనమున కేగుట, రాజధర్మమిటువలె జేయుముకై కదురిత మతియై,యొ రించిన యపరాధముక్షమిం పు మని భరతుడన్న పాదములకు మ్రొక్కెను ॥వినవే॥

భరతుని రాముడు తొడపైనిడుకొని, పరగ బుజ్జగించి దశరథ నరనాథు డునన్నరణ్యమునపదు, నాల్గేండ్లువసించిమీాదట - పురము జేరుమనెనంతదనుకనిను, ధరణిగావగబంచినాడిది - యిరుపురమును నెఱపవలెనవినమరతు, డింది రేసుగాంచిజనకుడు - కరటికాముకుడు భ్రాంతుడతనివా, క్యమనృతమన వత్సాదశరథు - డరయసత్యవాది యతనిదూరకు, మనినసామిమునినై సేవనమున - జరియింతు నీవు ధర యేలుమనుడు, హరియ దేటితగవటంచన నేనునీ - చరణముగొ లిచివత్తుననిన దాశరథి వలద యోధ్యకుబొమ్మనెదమ్మని ॥వినవే॥ 1

శ్రీయొల్లన యోధ్యయొల్లదనుపుత్య, జింతునను చు లేచి భర తుడు ప్రాయోపవేశమునకై కుశభూ శాయియైనజూచి రాముడు మాయు రేయనికులగురుని కనుసైగ చేయసతండేగిభరతుని - డాయ బోయి నావాక్యమునతండ్రి, మాయలుబోధించి వినునా - రావణు డచ్యుతుండీరాముడు, బ్రహ్మచేత బ్రార్థితుడై రఘుకుల - తోయ ధింబుట్టెను రావణాదులను దునిమివచ్చునన నత డద్భుతముగ - శ్రీయుతునకునతుడై పాదుకల, ద్రించరాము డొసగ మాళినిడుకొని తోయజాక్షునమయాతీతమైన, నేయనలము జొచ్చువాడననె భర తుడు ॥వినవే॥

కైకసాశ్రుజలనయనయై శౌరి,గనిమంతనమందు రామా నీక పరాధమున జేసితిఖలనై నిందబడితినెండునినునయ్య, చేకదుణింపుముసీ వామహిమ శ్రీనివాసము న్నెఱుగగు - ణాకరుడవగుణు డవ్రవిష్ణుడవ

వ్యయుడవునీయందులోకా - నీకములోనినీదుమాయ చేజననవిలయవిల
యములజెందును - నీకస్యము లేదు ఇంద్రజాలకుని తెఱగున మాయా
మనుజతనువు - చేకొనినటియింతునీవునీచే, లోకులు ప్రేరితులై
చరింతురు ది-వౌకసకార్యమొనర్చితినీమా, యాకళామోహితాత్మ
నైతి నేనని ॥విన॥ 3

పాహిపాహి దేవ దేవనమోస్తు, పద్మనాభ సీతానాయక మోహ
మనెడి ముడివిడుమనిజనని, బొగడనత ప్రాతావనుడగు - శ్రీహరి
చిరునగవుదొలుక బలికెను, చెలగిధీస మేతనిజ మేయు - దాహరించి
తివి నిర్జర కార్యార్థము నేనీచేతనిటుల - వ్యాహృతముగ బలికించితి
నిక భ, వము లేదదెనన్ను దలపుము - ద్రోహాస్నేహములు లే వితని
కనిదు, ష్టులు నను దెలియలే రనిన ఖగ - వాహనునకు మ్రొక్కి కైక
పిన్కొని వర సేనాయుతుడై భరతుడుజని - మోహనముగ నంది
గామమునను; బాహుకంఠలుంఠనునిదలచుచుండెను ॥విన॥

కుండలిశ యానుడిచట జననం, కులమనిభూమిసుతాలక్ష్మణు-
లండదండలనునడువదండకారణ్యముజొచ్చిశ్రితాశ్రితుడై-యుండెడి
యత్రిమునికిమ్రొక్కినతడొసగె నర్ఘ్యముజితాహితునక - ఖండ
కీర్తిననసూయకుజానకి, దండమిడనభిమతార్థసిద్ధి - దండిగనగునని
దీవించియిచ్చె, గుండలయుగ మనసీతనయను - మెండుగజకుర్ద శాబ్ద
ములనుకా, క్షీర చందనాద్యలంకారములు - నిండుమనంబున నొసగె
ననూయ, నృపలలాముడగు రాముడత్రిముని - మండలాఖండలుని
గోడ దత్త్వమహితగోష్ఠినుండె నమరసన్నుతుడై ॥విన॥ 5

భాసాపతిసుతుడగు శ్రీరాముని, భయభక్తులుమీఱజేరియు -
మభువనములు సృజించియుని, పోషించుటకును దారాకృతులను -

వేషధారివలె బూనెదవునీవు – రోషదూరారామాయా – యోషామణి
యఖిలము భ్రమించునది, యొదుగుసీకువీరాధివీరా – దోషాచరహర
హరచాపదళన, పోషితముని సవనాయవనిక డు – భూషించెలక్ష్మణుడు
నాచేని, మ్ముగబలుక నంబడి యీచరితమాంధ్ర – భాషనధ్యాత్మ
రామాయణమున, బగగ నయోధ్యాకాండమురచించె – శేషాచల
పతిపేర నతనికృప, చే సుబ్రహ్మణ్య కవీంద్రుడు ముదమున ॥విన॥

అ యో ధ్యా కాం డ ము

సం పూ ర్ణ ము



శ్రీ ర స్తు

# శ్రీమదధ్యాత్మ రామాయణ కీర్తనలు

## అ ర ణ్యా కాం డ ము

### 1 దేవగాంధారిరాగము—ఆదితాళము

పల్లవి—శ్రీశేషాచలవాసువినుతి - సేయ నెవరికైన నదరమా ఉమా॥

అను—శ్రీశుడత్రిమునిచే దారిటెఱిగిది, సేశోదయకాలమున గదలసీ -
తాసుమిత్రాసుతులతో మదవే, దండపుండరీకానీక చమ - రీశ
వరాహమహిషశరభకపి, వృకాదిమృగభయదమైఖగకులా-
వాసమై ప్రచండమా దండకా, వనముజొచ్చి యనుజునితో
ననియెను ॥శ్రీశేషా॥

మనుజాశనకంటకావృతంబీ, వనమును మనమతిప్రయత్నము
గబో - జనుచు ఖేటముల్గొనుచు, జనకజముందఱ వెనుక రాముల -
క్ష్మణు లిరువురు జనికనిరి యసురనా. ఘనిమానిఖగవ్యాఘుని విరా
ఘుని - ఘనశూలముద్రిప్పుచువాడువచ్చి, కట్టలుకన్ మీరెవరని
యడిగిన - వినురాఘవులముదశరథవిభునను, పుపసుజనుల బ్రోవ
లులజీవ - ధనము గొనివచ్చితిమన బ్రతికెడి, తలంపుగలిగినలలన
సగి చను - డనికదియమహాసిచే రాముడాదనుజ కరచరణశిర
ములు వఱసనగకె ॥శ్రీశేషా॥

శ్రీరామునిగాగిట జేర్చిసీత, చెలగెదుందు భిరవము విఱులు
రిసె దోరముగాగడు శృంగారముగా - సారెకునచ్చర లాడిరిపాడిరి
రికి న్నరుల్విరాధుజంపుట, ఖేచరజలిరరికరిహరిహైనహరి - ఛాత్ర

భూషణద్యుతినసమధృతిను, దారశుభాకృతి నమలాంబరభృతి-తా
పథమధ్యగుడగుకవిగతి, దనరుచక్రధరుని శౌరినిగని - కోరికదీఱవి
మ్రుడై మ్రొక్కె, గుణాఢ్యవిద్యాధరుండదుర్వాసు - భూరిశాపము
నసుగనైతినిదెముక్తి నీవలననగుట నవిరాధుడు ॥శ్రీ॥

భవరోగవైద్యదయాకరనమో, ధవళాంబుజాక్షనినుదలచుచు
గను, చవినుచునువుచునంటుచును, నవిరళముగ మ్రొక్కుచును
డగ, సేయవలెనామనోనేత్రశ్రోత్రజి, హ్వాకరశిరములురామతారక
నామ,భవనుతయని బలుకహరి, నగుచునాభక్తిదుర్లభంబదినీకుగ
బ్రవిమలసుజ్ఞానివైతివనవిని, ప్రకటసుగుణభద్రా రామభద్రా - ఎవరు
నీకుసములధికులంటంచు, నిజేచ్ఛ నరిగెవిద్యాధరుడంతట - రవికు
పాలిజేరెశరభంగాశ్రమమ్మునిగనె సీతానుజుడగు ॥శ్రీ॥

చూచియెదుర్కొని పాద్యమొసగియు, చ్యుతసుఖాసీను జే
పూజించి - నీచమతుల్ఘనసంసారరతుల్ - ఓచిత్తజజనకనినుదెలియ
లే, దురుతరమగు, కటాక్షముననిను - జూచితినేచి యఘములబో
ద్రోచితియ - హోచిత్రమనుచు, బలికిశరభంగ యోగిదారువుల
ప్రోవిడియనలము - చేచితి దరికొల్పియందురికెనీ, తాచంపకగం
యుతుహృద్గ్రంధి - మోచనువిశాలలోచను మానసమునందుని
ముక్తతనుడయ్యెదటి - వేఛిదండకావాసులైన మునులాచతుర్భుజ
జేరజని పొడగనిరి ॥శ్రీ॥

మ్రొక్కిరఘూత్తముడుమునులారాసుఖ, ముగదామీకనిన
క్కనులచే - జిక్కితిమిబాధలస్రుక్కితిమిగ్రక్కునమముబ్రోవుమను
రామునకక్కడనున్న కపాలముల్ జూపి వెక్కసమమునవృజినులఘనుల
నుల-జక్కజేసిరింతయుదైత్యకృతమేశరఘుమా మొరాలింపుమనిన
యుక్కడంతుదానవులనని, యభయమొసగె మునులకెల్ల మదిరంజి

మక్కువతోభరతాగ్రజుడు నిలిచె, మౌనిగృహములందు గొన్నేం
డ్లచట - నక్కజతో జనికనియె సుతీక్ష్ణను, డనుమునీంద్రుడు పర
బ్రహ్మమూర్తియగు ॥శ్రీ॥ 5

## మంగళకౌశిక—ఆదితాళము

పల్లవి—వీనులవిందుగనువిన, వేయాచరితవిమ్మగను॥
అను—శ్రీనివాసుని బూజించిసుతీక్ష్ణముడుస, మ్మానముగాంచి సా
నందుడై పలికెను ॥వీనుల॥

రామసీతారకనామమంత్రజపము - సేమమున జేసితి, సీర
జాక్ష శ్రీమహిళాధీశ శివవిరించసేవ్య - కామసంసారసాగరతరణ
చరణాయని ॥వీనుల॥ 1

సతిసుతాదిఘోరసం, సారాంధకూప - పతితుడనై, పాప
మతినై - గతిగానననను, గనని శ్రేతుకదయా - మతివై నీవే వచ్చితి
వనెను సంయమి ॥వీనుల॥ 2

సకలభూతమౌన, సాలయుడవైనను బ్రకటించినిన్ను జపమ్ము
సేయుస - వికలులమాయావివశులుగ జేయు - నకటనిను భజియించన
ఘముబాపుదువనెను వీనుల॥ 3

విశ్వసృష్టిస్థితినిలయములకజహరి - విశ్వేశరూపముల వెలయు
దీవుహరి - దశ్వేడనేకపాత్రములగన, బహుభంగి - శాశ్వతుడవిది
మూఢ, జనులెఱుగర నెదపసి ॥వీనుల॥ 4

పరమేశప్రకృతికి బరుడవౌ నీదివ్య - చరణముల్గంటిదృక్స్వాం
తములకు గో - చరుడవుగావైన, హరినీనామస్మరణ - పరమతుల
కెపుడుగను పట్టుదువనెమౌని ॥వీనుల॥ 5

రూపాద్యుపాధిదూ, రుడవైనమాయానట - నాపాదితమౌనీ
మూ, నవరూపమయినది - గోపాడగంటిస్మర, కోటిసుందరముశర -
చాపాన్వితముకరుణా, శ్రయనేత్రయ నెనుముని ॥వీనుల॥ 6

స్మితలలితాస్యము - సీతాయుతమజనా బరమ - జితముసౌమి త్రిసే, వితపాదమున - ప్రతిమమసితోత్పలా, భమమద్భాగధేయమతి శాంతమగునీశు, భాగముగంటినని ॥వీనుల॥ 7

దేశకాలకర్మా, తీతవిజ్ఞాన మఖ - లేశ నీరూపవతి, హితమ మలము - నాశరహితము స్వప్రకాశమునిఖిలావ - కాశము చిద్ఘనా, కాశమని పొగడెముని ॥వీనుల॥ 8

ఈరూపుభావించి, యికనొకటినామనసు - కోరలేదనినముని, తోరాముడు చె - న్నారగబల్కెముని, నాథ నీమదిమత్సర - మా ధనమునని, ర్మలమాటెఱుగుదునని ॥వీనుల॥ 9

మీవంటిభక్తుల బ్రోవ వచ్చితినన్ను - భావించి వినుతించి, సేవించిమా - కీవేగతియనువారి, కెపుడు జూపట్టుచు - గోవిందుడ నేను ము, క్తుడవైతివని జక్రి ॥వీనుల॥ 10

ఈపావనస్తోత్ర, మెవరు పఠించిన - దాపత్రయమును బాయు దురు - దీపించిమద్భక్తి దృఢమౌసుజ్ఞానము - ప్రాపింతురు పరమ పదమనెను రాఘవుడు ॥వీనుల॥ 11

మనమగస్త్యునిజూడ జనవలెనని సుతీ - క్ష్ణయుతుడై సీతాల, క్ష్మణులతోడ, - జని యగస్త్యానుజుని, గని యుపల శేషశైల నివాసు డగస్త్యాశ్రమముజేరి నుతించె ॥వీనుల॥ 12

### 3 నవరోజురాగము—ఆదితాళము

పల్లవి—వినవే తరుణీమణి శ్రీరాముని - వినుతగుణస్తోముని సుచరి
త్రము॥

అను—ఘనమైన షడృతుఫలమసిలో - ధనమై, రాజితబహువి
హంగ - స్వనమై జితనందనమైమునిధనమై, నరసుమనోసురం
జనమై - తగునగస్త్యునితపో వనమినకులమణి, గనిమెచ్చి
సుతీ, క్ష్ణనీగురునకు, నూరార దెలుపుమనె ॥విన॥

స్వామీ మహాప్రసాద మనిసుతీ - క్ష్ణుడగస్త్యుని జాయజని మ్రొక్కియు - హోమహాత్మసీతాలక్ష్మణులతో, రాము డిటకువచ్చి నాడనినమాని - యామాటవిని హెచ్చి యెదురేగి హారికి, శ్రీమీాఅ నర్ఘ్యమిచ్చి తోడితెచ్చి - రామా, యంబుజకులాబ్ధిసోమా, నీలవారి వాహాస్తోమ - శ్యామా, శ్రీరామా హృదయాభిరామా సంగర భీమా పాలకదలికదనజు, చేమును ప్రార్థితుడవై దశరథుని నోము పంటవై పుట్టితవసి నుతించె ॥విన॥

సకలభువనసృష్టికి పూర్వమునం దొకడవై నిరుపాధికుడవై యే - వికల్పములేకయున్న సినుజెందిమూాల, ప్రకృతియైన నీమాయ యవ్యాకృతమనగ - బ్రకటమై సృజనసేయ, మహత్తత్త్వమున - నొకటిగ గ్లైమునిగేయ, దానికహంకృతినామకమై, యొకటిజనించె గుణాత్మకమై, అహంకారమున కర్భకమయ్యెను దానివలన నేకమై తన్మాత్రభూతేంద్రియా - త్మకమయ్యె న్నిటికిసూత్రా. త్మకనుగు లింగమొదవెనందు విరాట్టుకలిగి జగములతడు సృజించెననె ముని॥వి॥

నీవు రజస్సత్త్వతమోగుణముల, స్థితిలయములను చేయుచుం దువు మాయాగుణభేద - భావాభావముల నొందవు, అవస్థాత్రయ ముల కేవలుడవై కనుగొందువుసా, క్షీవి చిన్మయుడవు - దేవాధి దేవయోమహాను - భావా యెపుడు సృష్టిలీలకు_గావాంఛింతువపుడు మాయను నీవంగీకరించి గుణవంతుని - క్రీవనుందు వామాయవి - ద్యావిద్యలు రెండై దనరువిద్య యమృతికరమనె ముని ॥విన॥ ౩

వినుమవిద్యనొందిన ఖలులగుదురు, విద్యనెనయుసమరులౌదు రదినీపా - దనలినభక్తి చేగానిదొరక నేరదు, గనుకనీసేవబూనిజేసిన యతడె - ఘనుడుకమలజాని పాదసేవకు, మొనయునివాడజ్ఞాని స్వప్నమునందైనను - కనరాదతనిముక్తిమార్గ - మనరా, మధులు

వేయు వేటికిదసరా, ఘనమోక్షముబుధ - జనరా - జీతోడ సంగతి నసిమును - నలరా, జన గర్వమోహమద- గుణ రహితులు శమద మరతులు సర్వ, జనహితులు భగవద్భక్తిరతులని తపసి ॥విన॥ 4

ఏయుపాయమున, నైననీయందు-దోయజాక్షనా. కుప్రవత్తి గలుగజేయుము నిరతము, నీదర్శనము సఫలమై చెలగె నాజన్మము నేడు నాక్రతువులెల్ల- శ్రీయుక్తములాయెజూ, డు నాటనుండినే - జేయుతపమునకు నేడు, నీపాదార్చనముగదోయి, సీతతోడ నీవహి శాయి, నామది నిల్వుమెంచు - బోయి, నావునసుని-ర్మాయి,స్మృతి గలుగ జేయునతసుఖ దాయియనుచు బొగడి యక్షయ. సాయక తూణీరచాపకృపాణ, సాధనములగస్త్యుడు రాఘవునకొసగె ॥విన॥5

మేదినిభారహరణార్థము, యీమేనుబూనినా, వుగావుసరావ ణాదుల జంపుపొమ్ము పంచవటి గౌతమీనది చెంతదనరారు రెండు యోజనముల, మీాద నదిచెలువుమీారునటకొన్నినాళ్ళు వినోదింపు ముదముచేకూఱు గమలకాంత. వి - నోదిగర్వితదనుజ చయవిభేదీ యోగిజనానందా - పాదీనిరతముజగ, దాదీ సత్యవాదీయ ఖేదమణీ- వేదియనుపల్కు-కుంభ భవు, పాదములకు నతుడై శేషశైలవాసుడ వలజని నవనిజానుజులతో ॥విన॥

4 దేశీయ దేవగాంధారి—అటతాళము

పల్లవి—చానరోవినవే శ్రీరామ, చంద్రుని చరితము రసభరితము॥

అను—శ్రీనివాసుడు త్రోవబోవుచో బర్వతిశ, రీఘని జటాయువుని
గని సౌమిత్రితో బలికెను ॥చా॥

విలుదేలత్మ్మణాపీని బొలియుంతు పీడసుర-వలె నున్నాడనిన నామాట, విని ఖగరాజు - అభుకుచు నిచ్చోట, రామా నీవు

శ్రీరామా నీవి - ట్లలుగకు భవత్పితృసఖుడను జ, టాయువనువాడ నాపైదయ - జిలుకవేయనుడుకౌగిట నలమి యతనికి హరిసెల వొసగె ॥చా॥ 1

భానువంశమౌళీ, పంచవటీగౌత - మీనదీతటకమునందు జేర నచ్చటరా-మానుజుడనువొం, దుపర్ణశాలలు, ఆపర్ణశాలలు పూన రెండురచించెనొకశుభ, మైనలగ్నమున సీతాయుతు - డైనరేంద్రు డచటనిలిచి, యలరుచునుగడపెమూడు నెలలు ॥చా॥ 2

కందమూలములుల, త్మ్మణుడుదెచ్చియన్న-ముందరనిడిచరణ ముల్గొల్చుచరాత్రు-లందెల్లజాగరణ, ములేసేయుచు, ఆసేయుచు వి-ల్లందిశరములుబూనిసేవా, నందుడైయుండిరొకతఱిగని - మంద హాసవదనార, విందుడగు రాఘువునకనియెను ॥చా॥ 3

మోక్షకారణమా మొదలితత్వమంబు - జాక్షనీవలననే, ను దెలియగోరితి-రక్షింపునీకన్న రక్షకులు, ఆరక్షకులులే రక్షయజ్ఞాన విజ్ఞానవి, రాగయుతమనిదానిదెల్పు-మీక్షణంబయనననుజునకిట్లనెను దాశరథీ ధీనిధీ ॥చా॥ 4

వినుమాయాస్వరూపమువివరించి, వెనుకసంవిద్రూపు దెలిపె దను - అనాత్మమైన యీతనువె, యాత్మగానెదను దోచుటేమాయ తోచుటేమాయ - అనఘదానివలనసంసారమూ, యావిక్షేపావరణ ము-లనెడుయీరెండామూ, యశాకృతులనెరాముడనుపుగ ॥చా॥ 5

పరగజగములింగాద్య బ్రహ్మాండముగవిక్షే, పముసృజించె మించియా - వరణముపరమాత్మనావరించి జ్ఞానరూపమైజ్ఞానరూపమై బెరసెద్రాడహియని భ్రమసిన, ట్లురుమాయచేనైన జగములు పర తత్వమునగల దనుటరయనవిచారమనె రాముడు ॥చా॥ 6

కలంగొగన్నవస్తువుల వలనెసత్తుగా దఖల - ములుమహేంద్ర జాలముసంసారమను, బలుచెట్టునకుమూల, ముదేహమేనని, దెలిపి

తన్మాత్రభూత హృదింద్రియాహంకారబుద్ధిప్రకృ-తులునహానంతియు నుతనువన, జెలగు నన్నిటికాత్మసాక్షియనే ॥చాన॥ 7

జ్ఞానమునకునహంకార,మానడంభజయములుక, మానుటబు జాభావము సేవించిభక్తి - చేనిజగురుని దైవముగాగ నేన్నుట, గాక నెన్నుట-మేనిదోసము లెఱుగుటతనుమ, నోనిగ్రహము ఈక్షణవిరతి, బూనినాయుండనన్యం, బైనమతియును సాధనములనె ॥చాన॥ 8

ఆసలన్నిటినిజ్ఞా, నాసిచేదునిమి, సచ్చిదానంద చైతన్యము తానవిదెలిసి - భాసిలుటెసాజన్యము, వాడెధన్యుడు - డాసియను భవము గురుశాస్త్రాభ్యాసమున గనిజీవపదులవి - లాసవైఖరుల గూర్ప దొలగుమాయయిదె ముక్తియనె ॥చాన॥ 9

మచ్చరణస్మృతిలేని, మనుజులిదిజెందరే - రచ్చపుతమములో నజ్యోతిలేకగని, వచ్చునేమేరికైనగావునసన్ను, గావునన-నిచ్చదల చువారలకుని, మ్మావిద్యయొరులకీవలదని - హెచ్చుగాదెలిపె శేషగి, రీశుడనుజునకుముద మొదవగ ॥చాన॥ 10

5 అఠానరాగము—ఆదితాళము

పల్లవి—వినగదవేమద, వేదండగమన - మనసారసార, సనేత్రు చరిత్రము॥

అను—మనుజాశ నిశా, మరూపిణియు శూ - ర్పణఖయనెడుమానివి వచ్చియపుడు - కనుగొనె రవివ, ఱునిజగద్గురుని ॥విన॥

ఆదరిహాసమామ హాల్లాస - మాదరస్మి రకటాక్షవిలాస మాదరిదళితాబ్జాస్యవికాశమాయిందిరానఖసుఖనివాస మేదనద్భ్రయు రముసుందర, మైయలరునుదరముఅనతజన-ఖేదములనడచిమోదము లనొసగ గాదగు చరణపల్లవములు ఆ - మీఁదట నఖసా

ష్టపములజిగి - బ్రోదియిడు తోడలచందము రామునిపాదపద్మముల యందముగని, యాదానవిమదనాశుగములచే, నదరిచెదరి దనుజారి తోబలికె ॥విన॥

ఎవ్వరువీరారు ఏమిమీపేరు, లివ్వనికిట్లేలనే తెంచినారు ఎవ్వరి కుమారు లీచెలువారు - జవ్వనియెవతె, నిన్ను వేమారు - బువ్వవిల్తు కేళిగలయగ, బూనినాను శాళినన్నేలుము - నవ్వుగాదనఘనా పేరు శూర్ప, ణఖయం|ద్రురావణునకుజెల్లె - నివ్వార్తకతడు ముదముచే గడు, నివ్వటిల్లుఖరదూషణాదులునిన్ను గొల్తుర రిభీమణాయనిన-నవ్వు చుసీతవిన, గరాముడనియె నవ్యనితకుభయహితవులొదవుగాను ॥విన॥

ఘనుకులుడను రా, మాభిధానుడను వినుదశరథవిభుతనయు డనతడను - వనిటవచ్చితిమదనుజుడిదిగో, కనుగొనుమీసతినే, ననల సాక్షిగాను-ఘనత బెండ్లియాడినాను, గనుకదీనితో, డియాపోటికి, మొనసినీవునో, రిదువెసౌమిత్రి నెనయుమనిన, జనివేడిన నతడనియె లలన ననుగూడిన నీవు నుదాసివవుట నిజమనరాముని, యొద్దకేగి యదిఘనాకృతి, గనలిసీతపైజన లక్ష్మణుడసిగొని ముక్కు-జెవుల, గోసె రక్కసికి ॥విన॥

అఱచుచుబారి, యదిఖరునిజేరి, మొరపెట్ట సురారిభూరిరణ భేరి, పరగగదలి, శూర్పణఖచేదారి, నెఱిగిబలములరి, మురినడచె మారి, పరులువచ్చుటగని యనుజుని, ధరణిజనుందోడ్కొని, యగ్గిరి గుహకరుగబనిచి రాఘువుడుధనుశ్శరవరకరుడై బలువీరులదోడ్కొనె ఖరదూషణత్రి, శిరులుదాకిరి, హరిపైజనునేనుగులునా, హరిమెఱ యనేన, నొక బగలువదెగ, నరికినారాయ, ణాస్త్రమునరాము కరులదొరలతలల, దొరలనేసె నవనిపై ॥విన॥

తమ్ముడువచ్చి సీతనుదోడితెచ్చి యమ్మెయినన్నసా, హసము మెచ్చి, నెమ్మినుండెను సు, ఖమ్మునహెచ్చి యమ్మది రక్కసి,

యటలంకజొచ్చి, పమ్మిరావణుచరణమ్ముల బడివగవనతడుకరుణన్
జెలియులిగాగిట, గ్రమ్మియుదేమన రామలక్ష్మణులు కాంతారసీమ
మెలగ రామునికలికి చెలువలరిచెలగగానీకిమ్మనవన్నిటు జేసిరినీ,
తమ్ము లిందుకై పొలసిరియునిన, కొమ్మసూరార్చిర, తోవిభుడు
రాముని నిమ్మహి శేషగిరీశునిగా దలచె ॥విన॥ 5

6 ఘరజురాగము— అటతాళను

పల్లవి—ఇంతిచెంగల్వ, బంతిచెలువలమేల్, బంతిగుణముల, దొంతి
విన వే॥

అనుపల్లవి—శ్రీకాంతుడుగాకున్న ఖరదూషణాదులనా, వంతలోన
జంప, నెంతవారునరులని చింతించిదశకంఠు డసురుల, శిక్షింప
జక్రియినకులమున. మంతు కెక్కజనించె శ్రీరా, మాఖ్య
బ్రహ్మదినుతుడై యనె ॥నింతి॥

ఐనగానిమ్ము శ్రీహరిచేతబొలిసితె, మానుగవైకుంఠ, మందిర
మేలుదు - నేనతనిగెలిచితి, నేసిరాక్షసరాజ్య, మీనేగలదనుక యే
లుదుననితలచి, భానునిభమగురథ మెక్కివిధి, పూనిప్రేరేపదుర్మతి
వై, రానుగత హృదయుడై చనియెను రావణుడు మారీచునింటి
॥నింతి॥

వచ్చినదనుజేశు, జెచ్చెరబూజించి, వచ్చినపనిదెలుప వ
నన్నమారీచు, మచ్చికజేసిరావణుడు, బలికెరాముడు హెచ్చికా
కుజశర, ధేశుడు బంపగ, వచ్చిమునులకు నెల్లనభయంబిచ్చి మ
ఖరదూషణాదుల, వచ్చినాడటరాము సతినే, దెచ్చియేలుదున
నతడనియె ॥నింతి॥

రాముడు నరుడని, రావణతలచేవు, శ్రీమహావిష్ణువు, సీత
మహాలక్ష్మి, యీమేనుబూనినా, డిచటనినుబొరిగొన, నామహాత్

నిచెనకు, టదిచేమ్చుత్యువినువి - శ్వామిత్రుక్రతువునసుబాహుని
జంపిరఘుపతి నన్ను శరముని - నీమహోదధిపై చెబ్రతికితి, నేమిసు
కృతముకతననోయన ॥వింతి॥

హరినిన్ను బొలియింప, నవతరించినట్లయితే - వెఱచి తెజంప
కవిడుచునా లేలెమ్ము - మెఱసి నీవు మాయా, మృగమై రాఘవుల
సత్వరముగ భ్రమియింపు ధరణిజనేదత్తు - మఱుమాటలాడ నిను
జంపుదు, మారీచయని రావణుం డన - వెఱచి, హరిచే దెగిన
మోక్షము, వీనిచే బడ నేలననికదలె ॥నింతి॥

పదియారువన్నియు, బంగారువలె దనువు - పొదలమేనిపై
వెండిపువ్వులవలెచుక్కలు, గుదిగొన మణిరుచుల గొమరారు
కొమ్ములు - కొదమరత్నము లసగా గొరిసెలుదనరగ - నుదుట
నీలములవలె గన్గవ, యొప్పమారీచుండు లేడిరై, కదలి శేషగిరీశు
డగురా, ఘవు డున్న పంచవటి జేరెను ॥ఇంతి॥

## 7 నాయకిరాగము—ఆదితాళము

పల్లవి—దీనభక్తజనసౌఖ్యదాయకి, ప్రాణనాయకివినవే॥

అను—ఆభానుకులుడు ఏకాంతమునసీత, తో నిటులనె రావణా
సురుడిదెనిను గొని, పోనరుగుదెంచె నీవంతర్హిత, వైనీడగు
ఛాయా మాత్రమునిలు, మీానసువర్షాంతమునందుపొంద, గా
నీకగునన నట్లనినిల్చెసతి ॥దీన॥

చెలగుకపటమృగముజూచి మాయా, సీతదీని గొని తెమ్మని
నశౌరి, విలునమ్ములు గొనిచనుచు జానకిని గొలిచియుండు సౌమిత్రి
నేసిలేడి, సలలితముమీార దెత్తుననినల, క్ష్మణుడిది మారీచుడుచేయు
పో, కలువలదీకార్యముబూనగానగారిస్తుతియుననిల్వకేగెహరి॥దీన॥ 1

సర్వపూర్ణుడయ్యు నచలుడయ్యును సాక్షియయ్యులోకా
సారిమై, పర్విడిమాయామృగము వెంటఁదగిలె, భక్తపోషణుండ నెడిను
విదితముగా, నుర్వీతనూజ కోరిక దీర్చఁగ నుద్దండాటవి రఘువీరుఁడుచ
దుర్వారామర్షణుఁడై మృగంబు, నుర్వింబడ నేసెనిశితాస్త్రముచేఁ ॥దీన॥

త్రుళ్ళుండంగికపటరూపు చెడిమా, రీచుడొరలుచో హాలక్ష్మణ
చెల్ల రేనన్ను బ్రోవుమని చక్రి, చీరినటులదోఁచ నార్తరవమునవిలపై
ద్రెళ్ళుచు మహీశుసన్నిధిచే, ముక్తింజెందెనచట నార్తధ్వనివిని, తల్ల
పడి భూమిజరాముఁడాప, దంబొందెను జను లక్ష్మణా యనెను ॥దీన॥

మూడుజగము లనికిదొడరి ననురా, ముడు భయార్తుడౌ
చెలియ, తెలియక నాడితివను మఱదినియతివసుజను లాడరానిమా
లాడనాతం డదివిన గూడక హరీయనుచు నన్నచనిన జాడంజ
రావణుడిష్టము, చేకూరె ననుచు జేరెను మౌనియని, గూఢాత్
కృతిమై ధరాసుతను ॥దీన॥

పూజజేసి సీత పలికె, మహా, పురుషనిలయము మత్పతివచ్చు
నుక నా, జనకజగనిమారెవరు దెలుపు నాతియనిన నయోధ్యాధిప
యగు దశరథరాజుకోడలను రామునిభార్యను, లక్ష్మణుడనుతమ్ము
దానునువని, రాజీవాక్షుడు పదునాలుగువత్స, రంబుల్ నిలజనకా
వచ్చెనని ॥దీన॥

నిన్నువిందునన. రావణుడనా, నెలవులంక దనుజవిభుడ
జగముల నన్నిటినిగెలిచి, నాను ననుబొందు నదునీకెందు క
విని భయంబు, నన్నెలత యోరిఖలుడ నిను రాము డస్త్రాహత
జేయుననున్ రావణు డెన్నిక బదితల, లిరువది కరంబు లిమ్మైలగ
రథమందు సీతనిడె ॥దీన॥

అలఘుగతిని బోవ శేషగిరినిల, యాహరీ రామ లక్ష్మణాయ
నుచు గలికివిలపింపని జటాయువిది దెలిసివచ్చి రణమొనర్చి కూల

...గిరివలె గులుకుచు దశాస్యుడరుగరినైదు, గురుకపులనుగనిలోడ
...ల్ ముడియిడి-చెలివై చెనచటలంకాపురంబు జేరియశోకవని సతిని
...చె ॥దీన॥

8 లలితపంచమిరాగము—ఆదితాళము

...ల్లవి—ఓవనితామణిరో ॥వినవే॥

...ము—వేవచ్చులక్ష్మణుని, వీక్షించిహరిమది నొకటిదలచె ॥నో॥
నేసాక్షినౌదునైన - నీజగము మాయామోహా - వ్యాసంగ
మొందజేతు, ననియెంచె - హాసౌమిత్రి హాసీత నచటడించి
వత్తురాతప్పు, జేసితివింక నేమి సేతుననినరాము గని యతడు
పలికె ॥నోవని॥ 1

ఆర్తనాదమువిని, యవనిజనన్ను బొమ్మన్న నార్తరక్షకుడతని
...లకుమనిన-వార్తిచేవినరానీదు, ర్వార్తలాడనీమార్గాను, వర్తినై
...తినన్ను మన్నింపవేయోదయానిధీయనెను ॥ఓ॥ 2

అటమీాదబర్ణశాల, కరిగిసీతలేకున్న రామచంద్రుడుశోకవా
...న్నిధిమునింగి-తామహామహుడయ్యెని, ర్దళితదుఃఖరాశియయ్యె -
...మరులకుజూడ జింతా, పరవశుడై నట్లు విలపింప దొడగె
...వని॥ 3

హాపూర్ణచంద్రానన, హాచకోరాక్షీయింత - కోపమానాతో
...క, కున్నావేమి - ఓపరమసాధ్వీయింక నేనెట్లోర్తునిమిషమొక
...మాయె బాపపుదైవమింతపగ వాడౌ టెఱుగనని వనితను
...కె ॥నోవని॥ 4

వెతకుచురాగాహాత, పక్షుడై పడియున్న - పతగేంద్రుగని
...నా, పరికించితే - అతివసీతదుమ్మింగి, హాతుడై నట్లున్నాడు

ఏని - ధృతిచేజంపుదు, విలునమ్ములు, దెమ్మినిన రామ నేజటాయు
నని ॥నోవని॥

హరిహరియనిడాయబోయి, యతనిచేదద్వీథ మెల్ల - నె
పక్షిరాజుమై, కరమున నిమిరి - పరగబోధించినరామా,హరిపర
త్ముడవునిన్ను - కరమర్థిజాచితిముక్తి, గంటినని ప్రాణముల్వీడి
నతడు ॥ఓవని॥

చితిబేర్చిపులుగుమేను, శిఖచేదహించెనంత - ధృతశంఖచ
గదాబ్జా, న్వితుడై హితుడై - నతుడై రుచిరతనుడై వరవిమా
నారూఢుడై జటాయు- వతిభక్తి శేషాచలపతియా రామునినుతియిం
దొడగ ॥ఓవని॥

జటాయుకృత శ్రీరామ స్తవము

చూర్ణిక

శ్రీమదగణితగుణమణిగణాలంకృత రుచిరచిరతర శుభస్వ
పం, సకలజనభయావహామహదజ్ఞానజనితకలికలుషాంధతామిస్రని
రకభవతారకదీపం, అనుపమాద్భుతమహత్త్వతాపం,హతదీనజన
మనస్తాపం, కరధృతవిదితామోఘశరచాపం,జగదుదయస్థితిసంహా
విర్భావతిరోధానాదిమహామాయావినోదనిదానం, అంగీకృతరంగ
గళాభంగతుంబురునారదసంగీతవీణామృదుగానం, భూతభవిష్యద్వ
మానకాలత్రయాబాధ్యమానం, అసమానం, అక్షీణకటాక్షవీ
రక్షితదాక్షాయణీప్రముఖనిఖిలభక్తజనసమూహం, నిర్దళితసకలసం
హం, దుర్వారోర్వీభరణహరణ నిర్వహణచణలీలామానవదే
శ్రీమత్కరుణావలోకన మాత్రతత్పితపాలాత్ చతుర్ముఖాదిస
నుపర్వాఖర్వఖేదంనిరంతరామసన్మసమాధిపరిపూర్ణపరమయోగి
హృదయ సరసీరుహాకర్ణికోపరిస్థితవితతజగత్పవిత్రా కృతాద్భుత

భావభాసురవియన్నదీ జనకవిభవాభిశోభిత కిసలయమృదుపాదంస
మ స్తజనానుమోదం, సతజన సంతత సకలకల్యాణగుణసంపాదండళ
త్పుండరీకపత్రజైత్రవిపులతరమనోహరవిలోచనం, శిలామయమూని
దూషాచణం, యాచిత వైరోచనం కుముదబాంధవకిరీట ప్రచండ
కోదండఖండనోద్దండ దోర్దండసముద్దామం, దేవతాసార్వభౌమం,రవి
కులపయఃపారావార పరిపూర్ణసోమం, గర్వితపూర్వగీర్వాణ వాహినీ
సందోహాకతినకంఠలుంఠన గళచ్ఛోణితారుణిత సహస్రకర సహస్ర
కోటిప్రభా భాసమానమహాభూత భయంకర సుదర్శనాభిధానావక్ర
చక్రాయుధాభిరామం, మారీచసుబాహువిరామం, హారహీరనీహార
కర్పూరసుధాసారడిండీరశరన్నీరద శారదానారద పూర్ణిమాచంద్ర
చంద్రికాధిక్కారదశదిగ్వ్యాపిత ధవళయశోధామం, శ్రీరామం,
జననమరణాదిఘోర సంసారమహాగహనదావదహనాయమాన సకల
జగజ్జేగీయమానపావననామధేయం, సూరిజనభాగవిధేయం, ఇంద్ర
నీలమణి ప్రతీకాశాతి స్ఫుటసుందరి కాయం - రమాకాంతకుచకుట్మ
లతటీచర్చితపటీరకుంకుమసంకుమద మిళచ్చందన పంకముద్రితశోభన
విశాలవక్షసం, హతఖరదూషణాది రాక్షసం- హృత్తేక్షితవివక్షం,
ప్రపన్నావదీక్షం - పరధనపరదారాముఖమునిజనసేవ్యం, దుష్టజన
దుర్విభావ్యం, ప్రణవైకసంస్తవ్యం, శ్రుతశిరోవీధికా శ్రావ్యం -
విలూనదంభాభిమాన నానాభువనసంస్తూయ మానసమానవపుర్ని
ర్మాణా సమానమానస సరోవర ముహుర్ముహుద్గతసముత్తుంగా
ఖండానంద వీచీపరంపరాలీలాడోలాందోళిత చిన్మయరాజహంసం,
రాజకులావతంసం - స్మితమనోజ్ఞానేందు మండలం, రత్నప్రభాకచ్ఛ
తచామీకర చారుకిరీటకుండలం, పోషితాఖండలం - గుణత్రయ
క్తిత్రయమూర్తి త్రయానువృత్తం, కరుణామయచిత్తం- పనసామ్ర
దలీక్రముక ఖర్జూరజంబునింబజంబీర పున్నాగచంపక వకులవకుళా

శోకిత మాలసాలరసాలాది కోరకితపుష్పితఫలిత మహామహీరుహ
రాజీవిరాజితరత్న చ్ఛవిచ్ఛటాలంకృత సానుప్రదేశ సంతతసమ
త్పతన్నిర్ఝ రాకలితప్రశస్త సమస్తవిలాసోల్లసిత శేషాచలశిఖ
మధ్య సువర్ణప్రసాద విహరణశీలం, తోషితాశేష భూపాలసురాసు
యక్షరక్షోరగ గరుడగంధర్వ సిద్ధసాధ్యకిన్నర కింపురుషవిద్యాధర
చారణాప్సరోబృందరచిత బహువందనం, భక్తజనచందనం, రఘు
నందనం, త్వాంభజామి త్వాంభజామి॥

## 10 శహాన—అటతాళము

పల్ల—కోరికూరిమి మీరికౌమారిభ - రారిచరితము ॥వినవే॥

అను—శ్రీరాముడు జటాయువు భక్తికిమెచ్చి - శ్రీమీరగ గైవల్య
మిచ్చి యావలజనిహెచ్చి ॥కో॥

సానుజుడై సీతవరయుచు రాముడు, జనిఘోరాకారుడై
రక్కసునిజూచి - మానధనుడౌ లక్ష్మణునితోడ బలికెను, వీనిబా
హువులలోన నిప్పుడు మనము - పూనిచిక్కితిమి కన్నులుగాను
డలేదు, వీనికినని తెగువతోన రాఘవులిరువురు - వానియోజనదీ
బాహుద్వయము దెగనఱికిన గబంధుడు - దాని కద్భుతమంది వీ
రెవరేనెఱుగనన జక్రిపలికెను ॥కోరి॥

దశరథసూనులము రామలక్ష్మణులము, తండ్రియాజ్ఞ ననము
సీతతోడ - వసియించియుండుమము వంచించియెవడో నా, వామాతి
గొనిచనెను, వెదకుచువచ్చి - వెసనిన్ను గంటి నీవెవడనిన గంధర
విభుడజునివరమునను జిరజీవినై - కోసరియష్టావక్రమునిగను, గో
నగినసురవగుమనిత - పసిశపించెవిమోచనము రఘుపతి సేయ
ననెను దైత్యుడు ॥కోరి॥

దనుజతనువుగాల్చ మెచ్చిగింతుసీతావృత్తాంత, మనవిన్నిట్లు సేయయరుదరుదిది-యవనసురాకృతివిడిచి దివ్యగంధర్వుడై, వినుతించెహానీమాయ మానవాకాయ - మనఘ దుష్టనిగ్రహార్థముబూనితివి పరమాత్ముడవు దైవరాయ, సన్మునిగేయ - మనోవాగగోచరుడవనాదినిధనుడవఖిలసాక్షీవిచి, ద్ఘనానందమయుడవు - రఘునందన వందనములు చేకొనుమనె ॥కోరి॥ 3

రూపరహితుడవయ్యు రెండురూపములుగల వోపరమపురుష నీకు స్థూలసూక్ష్ములు - ప్రాపునజగములు గలుగు వెలయునడగు నీపాదమానపరాకు, హిరణ్యగర్భ - యేపునసూక్ష్మమయి విరాట్టనువు స్థూలమై, దీవించెనదిమాకు, దెలియమును లలమట - కోపిధ్యానము సేయగ విరా, ట్పురుషుడన ధారణాశ్రయుడై - చేపట్టి రామునితనువె సుమ్మఖిలజగములుననె గబంధుడు ॥కోరి॥ 4

వానిజ్ఞానముమెచ్చి నరదుడుబలికెను వరమాయీ పావనస్తవమునువిడినిన - గాని, వారికిసిరులు గలుగుదురితము దొలగు గలుగదెన్నడు భయమనిసెలవియ్య - గానెరావణుడనురా, తీసుకు సీతనులంక, లోనుంచినాడీదినము, శబరిసద్దకి జను డానెలతచే సకలమునువిన, గానగుచు గిన్నరుడుజనె భానుకులమౌళి శేషాచలపతిమంతగాశ్రమముజేరెను ॥కోరి॥ 5

11 మాంజిరాగము—ఆదితాళము

పల్లవి—హితమతిసతీ పార్వతీ యా, చరితము వినవే॥
అను—రతిపతిశతాధికరుచి, రాంగుతా రామలక్ష్మణుల, నతివేడ్కజని యానందాబ్ధితేలి శబరి యెదుర్కొనెను ॥హిత॥

పదయుగళికిమ్రొక్కి, పాద్యమొసంగి తదంబుకణార్ద్రసదమల
సర్వాంగియైహరి దర్శన, ముదితవిలోచన జితసారంగియై, రాఘవుల
మన, స్మృదుఫలగంధమాల్యముల, దృప్తులజేసి హృదయము
ముదమొదవబలికెను రామునితో శబరి దరఘటితాంజలియగుచు ॥హిత॥

నినుగనిధన్యనై తనరితిఖిలుల, దునుమగమనుల మనుసగ,
దశరథునిసుతుడై నారా, యణుడు జనియించు, ననినాగురుడు
సుమ్రతు, డై దెల్పెనుమతంగ, మునియదినేడు నిజమాయె శరణు
శరణు దైవరాయావనితను హీనకులజను, నినుదెలియజాలనవ
రాముడుపలికె ॥హిత॥ 2

కులనామాశ్రమా, దులు హేతువులుగానె, బలనను దెలియగ
భక్తియొకటివినాయజనదానతపోమంత్ర, ములుభక్తిహీనములైనవి
ఫలములుగనుక, దెలిపెద భక్తిమార్గము, సులభమగు నపవర్గము
తొలుతసత్సంగతియా, వలమత్కథాలాపగుణరతులనెను ॥హిత॥ 3

ననుగొనియాడుటయు, ఘనగురుసేవయు, మనియమాదులను
ననుబూజించుట, ననుభవించినవారలను, గనిసంభావించుట సకల
భూతముల, ననురాగనిశమదమముల, నెనయుట విమలచిత్తముల
ననువివరించుటయు నివినవవిధభక్తు, లనితిరుగాహరిబలికె ॥హిత॥ 4

భావముసజ్జన, సేవనువిమలమైనది నీకు, గావున ననుజూడ
గాగలిగెనిక జానకితెఱగు వేవేగమెజూడగా దెలుపుమనసతిని,
రావణుడెత్తుకొనివేగ, లంకకుజనె మహాభాగా, దేవాదిదేవ నీకు
దెలియని, దిగలదేయనుచు జెలిపలికె ॥హిత॥

పంపానామసరో, వరతటిఋశ్యమూకాద్రిపై, బెంపునసుగ్రీ
వుడున్నా, డతనిసఖ్యముచేయుడింపు నతడుదోడ్ప, డునని తెలిపి

బరి, తెంపుననచటజితిబేర్చి, దేహముచిచ్చుతో గూర్చి, పొంపున
శ్రీవిభునిదల, చుచుదనువెడసిపరమపదమున కరిగె ॥హిత॥

ఈరఘువరస్తవము, నెవరుబఠించినవినిన, వారుకోరినకోర్కె-
చ్చు శేషాచలేశుడుకృపను, ఘోరదురితములను బుచ్చునిది
యా, కరమునూరిజనానందకరము, దారిద్ర్యసంకటహరము, ఆరణ్య
కాండము శ్రీమీంర సుబ్రహ్మణ్యకవి తెలిగించె ॥హిత॥

శ్రీ మదధ్యాత్మరామాయణ కీర్తనలు

అరణ్యకాండము సంపూర్ణము



శ్రీరస్తు

# శ్రీమదధ్యాత్మ రామాయణ కీర్తనలు

## కిష్కింధాకాండము

### 1 మాఋవరాగము—ఝంపతాళము

పల్లవి—శ్రీహిమాచలవరసుతాయీకథస, మాహితమతినైవినవే॥
అను—మోహనాబ్జోత్ఫలా, మోదయుతనై విమల మయిహం
చక్రవా॥

కాదివిహంగ కులకోలాహలమై, పనసామ్రవకుళ కదలీతరున
తతీరమైతగు పంపాతటినిడాసి, సాహసవిక్రమకళాకు, శలులగు రా
వులు, స్నానపానములుజేసి, శ్రమముబాసియలరిరి ॥శ్రీహి॥

వరఋశ్యమూకాద్రి, సరణిదప్పకనడచు, వారిశరచాపధరు
నృపవరుల, సురజటావల్కలాం, బరులజూచి, వెరగొంద సుగ్రీ
డరులనితలచిమంత్రి, వరుడైన హనుమంతు, వారినెరుగబను
నెఱవడుగైచనిమారుతి రామునియంఘ్రులు, శిరమునోళ నత్
జగదుదయ, స్థితిలయ, కరణశీలులైపురాణ పురుషులైతనరు, న
నారాయణులో గాకమీరె, వగని యడిగెను ॥శ్రీ॥

వినులక్ష్మగాయితని, వినుతవాక్పటిమంబు ఘనశబ్దశాస్త్రను
మై,శ్రుతిహితమై, తననవిహారివటువు-నతిమైత్రితోగనినే, దాశరథి

నను రాముడందురు నా, యనుజుడీతడు లక్ష్మణాఖ్యుడు సీతయను నా, వనితయు నేను నితడు నడవులచరించ మజ్జనకుశాసనమునవచ్చి పంచవటినుండ, దనుజుడెవడొకన్మోజగి సీతనెత్తుకచనె, దానివెద కదము నీవెవరో దెలుపుమనె రాముడు ॥శ్రీహి॥

వానరేంద్రుడు సుగ్రీవాఖ్యుడీగిరినమాత్యులు, దానున్నారు వాలికి, భయపడి మ, హానుభావా నను మీపాలికి, బంపె - నేను సుగ్రీవు మంత్రిని, వాయుసుతుడ హనుమానాహ్వయుడ సూర్య సూనునకు మీకుజెలిమి - మానితముగ జేసెదననుటకు రాఘవులు నను మతింప వారిదనమూపుపైనిడి తెచ్చి - భానుజుకెఱుగనేయ జెలంగి రామునిపాద, పద్మములకెఱగి తరుశాఖపీఠ మిడిరొ నతడు ॥శ్రీహి॥

రామాభిగమనంబు, సౌమిత్రిచే బ్లవగ, రాజువిని రిపువిఘాలా, వగపేల - భూమిసుతజాడ, యేలీలనైనందెత్తు - స్వామిరొక దనుజుడొకసతినెత్తుకొనిపోవ, భామమైతొడపులిటు, పాఱవైచెనని యియ్యరాముడు గనిసీతాహా, యనివిలాపింప బామరునిరీతిదైన్య, పడదగదని రవిజు - డమహామహునిదెలిపి యగ్నిసాక్షికముగ ప్రా మాణికములు చేసికొనిరిసఖ్యమునకై ॥శ్రీహి॥

మయసుతుడు మాయావి, వాలితోనని బెనగిపుయిలోడియ సురతొలగి, గుహాజొరని - ర్భయుడై వానితోడ, చెలగి యచట, దయచే నన్నునిచిపోయితానెలకు రాకున్న లయమాయెనన యని తలచి గుహానుశిలద్రోచి - భయమున జనియదిదెల్పగసచివుల్ నను గపి, పతినిజేసిరరిబారిగొని మాయన్న వచ్చి - ప్రియనురాజ్యమును గొని ననుదరిమిన శేషగిరీశ నేనదిమొదల్, ఇచటనునికి యనె నిన జుండు ॥శ్రీహి॥ 

2 కళ్యాణిరాగము—అటతాళము

పల్ల—తగవిన వే యీ చరిత్రదళ త్కంజదళ మంజుల నేత్రా - నగ
విభేదనమణిచయకాంతిస్ఫుట, సుగాత్ర నుతిపాత్రా॥

అనుపల్ల—వగబొగలు రవిజుగనిహరిని, పగతు దునిమెదననబలా
ధిక - డగువాలి గెలువ నెట్లగునని, యతడన్నబల మెన్న
గడగెను ॥తగవిన॥

దుందుభియనెడి దనుజు డాహవ, దోహలత మహిషరూపు -
జెంది వాలినిదొడరగొమ్ముల, సందెడలజీల్చి యతడేపు - ద్రుమ్మదిం
కాలందన్నిన త, ద్రక్తమీగిరి నెఱయ వాలిని - ఇందురాదల పగుల
నని శపి, యుంచెను, మతంగుడనె గపిపతి ॥తగ॥

అదిమొదలిచట నుందునభయత, ననఘదుందుభి శిరంబు
అదే యోజనములిమ్మనవాలి, ననిగెలుతు వనవినిముదంబు, గదు
పదియోజనాల్ జిమ్మినగని సప్తతాళపత్రములత, గదమియొక ప
గోయునటు లవి, చిదుము మనహారినగి విలుకొనియె ॥తగవిని॥

శరమొకటి శ్రీరాముడేసిన, సప్తసాలముల ద్రుంచి - గిరిధరా
తలరసాతల, నెఱిదిపోదిజేరెనదిగాంచి - తరుచరాధిపుడు రాము
పాదములకెలరుచు మ్రొక్కి శరణని - చరాచరమూలమైన పరా
త్పర వస్తువని పొగడదొడగెను ॥తగవిన॥

నాపూర్వపుణ్యఫలము జగ, న్నాథ నినుగనుట నేడు, ప్రాప
తలంత్రుని నినుసంసా, రనివృత్తికై ఘనులుజూడు - శ్రీపతినతి సు
ధనముకాం, క్షించి బుద్బుదసమంబదినీ - ప్రాపు పెన్నిధి పేదకబ్బిన
పగిది నేగంటినని నినజుడు ॥తగవిన॥

క్షణమెవడునీయందు మదిని, శ్చలముగానుంచువాని - ఘన
హాలతసమూలము దెగు నినురామ రామయనువాని - వినుతించ
హ్మహత్యాశత, మణఁగునిఖిలబ్రహ్మమునితో - చెనటంచుఁగాఁగ
ంచెను శ్రీ, శేషగిరిపతిని సుగ్రీవుడు ॥తగవిన॥

3 రేగుప్తి రాగము—ఆదితాళము

ల్లవి—గరుడగమను సచ్చరిత్రమువినవే, గౌరీసుకుమారీ॥
నుపల్లవి—సురుచిరాలింగనమున బరిహృత, గురుకలుషుడైతనరు
సుగ్రీవుని, వరదయాదృష్టిఁగనిచిఱునగవున, వదనశశిశృంగార,
శ్రీమీఱ - బరత త్త్వ మెఱఁగిపలికితివౌనను పాకృతు లెఱు
గక రఘుకులచంద్రు- కరటులనుమాయచేత మోహితులుఁ
గాజేతునవిపల్కె శ్రీపతి ॥గరుడ॥
లేలెమ్మిక వాలితోనకిఁజను, కీలుగురు తెఱఁగింపుఁ ద్రుంతు
- మేలుగహరిపల్కినకిష్కింధకు, మిహిరతనయుఁ డరిగి, కెరలు
- చాలసింహనాదము జేసినరిపు, శబ్దమువిని రోషారుణనేత్రుడై -
లిరానతనియురమినజుఁడరిచి, కేలబొడిచెవాలియమునిబోలి - వ్రా
దుసోలుచు నొకరినొకరేచి, జాలప్రొద్దుబోరాడి వాలిచే - దూలి
ముములుగ్రక్కుచు జనిహరి, తోననియె గపిరాజుతడబడి ॥గరు॥

రామానను జంపింపగదలచితి, వోమామయన్న చేనటులైనా
- సామీనను పోరిగొనుమనిపొగలిన, రాముడు కడువగచి,
సఖా - యేమిసేతు మీరిద్దరొకరూప, మైమెఱయుట నేయక
సితినని, సౌమిత్రిగని యితనికొక గుఱుతిడి, యీమాటుబంపు మా
న నతడనుపమ - హేమపుష్పమాలిక యొసగిపనుప, ధామనిధి
డరిగి వాలిఁబిలువ - నేమిచోద్యమని యాజికతడుబో, గా మగ
దారపలికెను ॥గరు॥

పోవలదుమహాత్మాప్రాపులేకితడు పోరికితిరిగివచ్చునా
నగివాలి - నేపీఱడనై పోకునికితగదు, వేవేలువచ్చినను నేవెఱవ
వేవేగనతనిప్రాపుతోడ, జావనడిచివత్తుననిన నంగదుచేవింటిరా
డడవులకువచ్చి, సీతగోల్పడివేడ రనిజునితోడ - తావహ్నిసాక్షి
మైత్రిజేసి, నేవానినిజంపుదుననినాడట - దేవదేవుడతని శరణమ
సుగ్రీవునిసచివుఁ జేయుమనెసతి ॥గరు॥

రాముడు సాక్షాన్నారాయణుడై, బ్రహ్మాదిసురలు బ్రార్థిం
రఘుకుల - సోముడై జనించె రావణవధకు, రామహితున కోరల
స్వజనులు - రేమిలేరబలపొమ్మనితమ్ముని, నెదిరిపోడువదరువుమ
వుననుండి - రాముడైంద్రబాణ మేయబడె సు, తారామసుతుడు
గిరిబోలి - మైమఱపుకొంతవడికి దెలిసిగుణధాము ధృతజటాస్తోము
వలయ - శ్యాము లక్ష్మణకపీంద్రాభిరాము, రామునిజూచి
పలికెను ॥గరు॥

నాచేసికపకార మేమిదిన, నాధసుతునివలన నుపకారమేమి
రాచనడక తెలియక చేసితివి, నీచేతజంపవచ్చునా బోయవై -
పొంచియేసినకీర్తియేమి, క్షత్రియుడవై తేనినన్నెదిర్చి చూచినయ
మగుసీతకొఱకురవి, సుతుశరణను లేమి, రామస్వామీ- నాచతుర
యెఱుగవు రావణుసాన్వయముతో సీతతోనిటకుదెత్తు - దోచద
యెదోసమాయెనికను, దుందుభివైరితో నృపుడనియె ॥గరు॥

సకలధర్మపాలుడనై చరింతు, శాసింతువిలుకాడనై, ఖలు
వారక గూతురుగోడలుదోడబుట్టువు, భ్రాతృభార్యబలుకసరియగు
నకటానీవెఱుగకతమ్మునిసతి, నతిబలాత్కారమున బట్టినపా - తక
నిన్నుజంపినపాపమువే - దనినవాలిస్రుక్కి హరికిమ్రొక్కి,
దప్పులు లేవు శ్రీపతివిజగ, దీశుడవని తెలిసెనన శేషగిరి - ని
నుధుశరము బెఱుక వాలియు, నింద్యమగు కైవల్యమొందెను ॥గరు॥

4 ఘంటారాగము - ఆదితాళము

పల్లవి—కోమలారుణ, పల్లవపాణి, కోరివినవె శార్వాణి॥

అను—భీమసంగ్రామహతుండైనవాలి, బేర్కొనివానరుల్ శోకించిరి ॥కోమ॥

తోరముగాసో, గనులబాష్ప, ధారలుభోరుననొలుక, తార హారములురాల కిష్కింధాపురివెడలి నడుమళుక - తారవదనవిజిత కాంతా తారాసతి నిజపతినిజేరి - వీరాధివీరాననుబాసిపోయి, తేరమణ, హాయని యడలెను ॥కోమ॥

రామాయేబాణమున నేసితో, నామగనినాబాణమున - దామ ంపక ననుజంపుమనుచుంధరణిసుతుల్నిగని, కోపమున-స్వామిదయ ఫలముగల్గెని, కేమిసుఖమనుభవించుమని-భామామణి విలపింప, రాముండామగువనూ, రార్పంగడంగెను ॥కోమ॥

ఊరకనేలపొ గలశోకమునకు, వేరైపోయినగతికి - నానేపతి వులతో యీాశ, రీరమోసీమదికి కోరి గుణభూతేంద్రియములు, చేరి లిగ నదితనువుళ - రీరనిత్యుడచలుడెవ్వరి, కీరీతిపగ చెదనని హరి ॥కోమ॥

అనఘతనువుదారువువలె జడముచి, దాత్మజీవుండు నిత్యుడని మొనసిపల్కితిసుఖదుఃఖము లనుభవించువారెవ్వరని - వనితామణి యడుగ రాఘవుండు వినియహంకారాద్యనుబంధమొ-ఘనసంసారము వునకు సుఖాసుఖము లజ్ఞానములనె ॥కోమ॥

బలుకోర్కెలు గలవానికిరానివి, కలలోదోంచునెటులటులనె దెలియనాద్యవిద్యాసంబంధముజీవికహంకృతియందుననెతలపెసంసార మదియె బంధముశుద్ధస్ఫటికమునగెంపు-నిలువనెఱుపై నట్లు మతీం ద్రియా కలననాత్మకు సంసృతియనె ॥కోమ॥

జీవుఁడుమనోయుతుఁడై యదిబోవు, త్రోవబోవుచుజన్మమృతి
మొందుచుబుణ్యావశేనా, భక్తులసంగతి - సుగతిత్రోవదెలిసి
దాదులకు, నేవేరా బ్రహ్మమనిదలచు - నీవు పూర్వసుకృతము
సేవించి ధన్యవైతివనె హరి ॥కోమ॥

నా చేబలుక బడిన ఈవిధమూ, లోచన సేసి సన్మతివై -
సుఖంపుమన, రాముని నుతి, యించేఁ దారకహితవై — ఆచక్రిమ
సుగ్రీవుని, కానందప్రదమయ్యోనతనిఁ - జూచి వాలికి క్రియల్ నే
సూచించిపంచె శ్రీరామచంద్రుడు ॥కోమ॥

తరణిజుఁడంగదపురస్సరుఁడై జ ప్పరమున వానితమవుంచి -
తోర్వి కేగిదహనాచర్యపర కరణీయములొనరించెన్ - పరమాహ్లాద
పరామపద, సరోజాతములుగాంచి మ్రొక్కిన - హరివీనులకెల్ల దొ
దినక, రాత్మజు మంత్రియంగదుండనె ॥కోమ॥

సిరియు రాజ్యము నీదె నినుసేవిం, చెద నను సుగ్రీవుగని
యగయు నీవే నేను రాజ వగుమని, యానతీయ లక్ష్మణుఁడుపురి
త్వరతోఁ జేరిసుగ్రీవునకలరిపట్టముగట్టివర్ష ఋతు- వరుగరమ్మనిచని
శేషగిరీశుఁడగు శ్రీరామునియొద్దకు ॥కోమ॥

౬ యమున రాగము - రూపక తాళము

పల్లవి—ఫణిశయనునిచరితమువిను, దాశా, యణీభక్తజనపరాయ

చేను—గుణనిధులౌ దాశరథులు ప్రవ, ర్షణాచల శిఖలస్థవిలస
సుమ, తరు, గణవృతమై బహువర్ణ మృ, గవిహగ సేవిత
మణిమృతమైవర్షపాత సహమగునొకగుహనుండిరి ॥ఫణి॥

శ్రీనివాసుఁడు నరాకృతిఁ జేకొనినాఁడని-మానివరులు, సురలు
రమనురాగమున - మానిఖగతమృగశరీరులై సేవింతురు, పూని
యనుదినము రాముని, యహోరాత్రుల - ధ్యానమాన సికుఁడై
లక్ష్మణుఁడే కాం, తమునవికసితముఖుఁడై తగురఘుపతిని జేరి-భానుని
నీచేమునువిన్న బోధనేమఱచితిఁ, గాని సులభమాక్రియా సంయో
గము సెలవిమ్మనియెను ॥ఫణి॥ 1

అనుజుడననుఁబూజించగ నంతములేదైన - వినుసంక్షేపము
గా వినిపింతు గురుదయ-ననుపమమంత్రోపదేశమైధీమంతుడు - మొన
గురునిచే బూజావిధి తెలిసి - నను సభక్తికముగానారాధించి
ప్రాత, స్నానాదికమగు నాహ్నికము - లొనర్చిశిలా స్థాపనము జేసి,
కృతసంకల్పుడై గంధకుసుమాదుల - ననుప్రతిమాది పూజసేయ
గవలెనని రాముఁడు ॥ఫణి॥ 2

నాసన్నిధి భక్తినేమిరొనఁగిన నేనందు, నని యలరుదు చాలా
భక్ష్యభోజ్యచందన - వాసోముఖ పూజాద్రవ్యములు దెచ్చిసిద్ధాసన
మున దేవునియెదుటఁ గూర్చుండి లీలాభాసురబహిరంతరమాతృకా,
న్యాసంబులు గేశవాదికముహూర్తపంజర - న్యాసంబులు జేసి హృద
యరవిమలజీవకళాధ్యాసియై సిలాదులకు కలాసిద్ధిఁ జేయవలెనని రా
ముఁడు ॥ఫణి॥ 3

హృదయావరణాదిపూజలాగమవిధి నొనరించి యర్ఘ్యపా
ద్యాచమవేదమధుపర్కసదమఁధూపదీపనైవేద్యనీరాజనాది,వివిధో
పచారముల నర్పించవలెనన్ననవిద్య-పొదలుచు నగ్నిప్రతిష్ఠాపనంబు
జేసి యగస్త్యోక్తమార్గమున హోమము వే - ల్చిదహనుఁదప్త సువర్ణ
ముగ, మణిభూషణుగవిష్ణు - పదస్థితుగాబుధుల్ సదాభావింతు
రనెనుహరి ॥ఫణి॥ 4

బలిపార్షదులకునిడినమంత్రజ, పము జేసి చెలఁగివి డెమిచ్చి నృ
గీతవాద్యము- లలరగనాముండరస్వస్తివచనాదులు, సలిపి నా ప్ర
దము శిరసావహించి హెచ్చి - లలిదండమర్పించి కరయుగళినాపా
జలజంబులుస్పృశించి తలనుంచి మహాసంస్మృతి, వలన బ్రోవుమని
ధ్యానమునుచేయునతఁహాపర, ములొందునని శేషగిరినిలయుఁడ
జన్మనకుఁ దెలిపె ॥ఫణి॥

6 పంతువరాళి—అటతాళము

పల్లవి—కలికియులరులములికిచిలుకల, కొలికిపీనులసుధజిలికికథవిన
అనుపల్లవి—చెలఁగిలక్ష్మణదేవుని దెలిపి ప్రాకృతునివలెమాయ య
వడహాసీతా, యనినిద్రజెందఁడాయెనుహరి ॥కలికి॥

అచటకిష్కింధాపురిలోహానునుంతుఁ, డతిసీతిమంతుఁ డగ
రేంద్రుడగు సుగ్రీవుని చేరి రాజా- ప్రచురతధనరాజ్యములఁ గొ
రామచంద్రు మహానుభావునిమఱచినావు - ఖచరపతిసుతుఁడు తె
గతి చెడక రాఘువుని జేరుము - విచిత్రివలదనిన విభుఁడు బిలుపిం
మ నెగవులను ॥కలికి॥

అంజనాసుతుఁడధిపునియాజ్ఞ వానరులరాఁబనిచినఖల దిక
లుబిక్కటిల్లఁగపివీరులు - మంజుతరగిరినిభశరీరులు, మహియునా
ముభేదిల్లవచ్చిరంత - గంజదళప్రేతుఁడై తగు కాకుత్ స్థకులుఁడ
లమునమణి - పుంజసామస్థితుఁడై పొరలెసీతావిరహార్తిచే ॥కలికి॥

జానకీహాచంద్రముఖి, ప్రాణములునీమేననిలిచిన-వేనన్ను బా
యుండాక చల్లనైమా, మానవతినంటినీకరములమఱినన్ను దాకు

…కాసుధాకర-భానుసముఁడాయె జంద్రుడు, పరికింపు లక్ష్మణా
…దివఱ-కేకాక్షి, దనుజుచేఁబడి, యెటులౌటయెఱుఁగన నెరాముడు
…కలికి॥

. స్త్రీసక్తుఁడై పానమదచేష్టనిటురాఁడుసు, గ్రీవునిద్రుంతునని
…ఘవుఁడు దొడరననుబంపుతీ - వ్రాసిహతునిఁజేతు నినసుతునని
…నుజుఁ, డలుగు హరికడురాయిడిసేయఁదగ - వాసౌమిత్రిసీవు చని
…లివలె జెడకుమనుమిఁకదడ-జేసినఁజెడు ననిన దవ, శిఖకరణికపి
…రి కతఁడరిగెను ॥కలికి॥

విలుగుణధ్వనిచేయఁగ, విని యంగదుఁడువచ్చిమ్రొక్కిన, వేగ
…దొరకుమారాకదెల్పుమనఁ జని - కలఁగి పురివాకిటనిలచెలక్ష్మ
…ఁడు, కపిరాజాపరాకాయన సుగ్రీవుఁడు-దెలిసిమారుతి నీవలుక,
…ప్పి యాఘనునిదెమ్మనఁజని - వలగొనికినుక వత్సలాను, జావలదని
…డితెచ్చెను ॥కలికి॥

పతిపనుపదారాంగనచని, భయభక్తివినయ సంభ్రమముల-
…జేసికుశలమేబావా, కోపమేమి-అతిభీతుఁడై హరివిభుడున, న్నని
…మిముదేరరాదేవా యతిచేయిబట్టి సతియంతఃపురికితోడ్తేర నతని
…రుగాని కపి-పతిరుమాయుతుఁడై పాన్పుననుండి యురికి, పడిలేచె
…అ వరివలె ॥కలికి॥

మదలోల లోచనుఁడై, మలయు రపిసుతుఁ గని యలిగిరా,
…నుజుఁడు పలికె సుగ్రీవాచేసినమేలు పదటగలిపిరుమావధూరతి
…వశతమఱచియున్నావా కాని వాలిని - పదరిప్రాణము, లుగొన్న
…, ప్రదరమెందు రెదురు జూచుచును-న్నదనిస రామకార్యమనఘు
…తఁడు మఱువఁడనెఁ బావని ॥కలికి॥

వానరులనిదెచూడు డెబ్బదిరెండువే, ల్వలనుగూడుక, భాను జుఁడు రాదలఁచినాఁడు అని పలికినపవ-మానసుతు చతురోక్తులకు తా మర్షతనున్న రాకొమరు వేఁడుకొని-భానుజుఁడుపూని వందనము జేసిన వానిఁగౌఁగిటనిడి యూర్మిళా - జానియాసీనుఁడయి సరసపూజలుగొని సఖునిచే ॥కలికి॥

రామదర్శనలాలసుఁడయి రథమెక్కి, లక్ష్మణకపీంద్రులు రణ భే, రీమృదంగములు మోదఁలగాగదలిహా, సూమన్నీలాంగదనలాది- భూమిరుహచరపతులుగు, ములుగొని గొల్వఁగాఁ - జామరసితాత పత్ర, సద్విభవయితులై శేషగిరి - ధాముఁడయి రఘుకులాబ్ధి సోముఁడగు, రామవిభుఁ జేరిరి ॥కలికి॥

7 కాంభోజిరాగము - అటతాళము

పల్ల—రామాభిరామ గుణధామ, రామ కథాసుధామా, ధురి
సామాన్యమా॥

అను—రామునికనతిదూరమే తేరుడిగివచ్చి, సౌమిత్రిరవి, సుతులు,
జేసిరినతులు, స్వామికౌఁగిటనిడియర్ఘ్యపూ, జామాన్యుఁజేయ
హరిపతిహరి-వామభాగాసీనుఁడయి రఘు, రామ నృపయి
టుజూడువచ్చిన - కామరూపులనగణితబలఁపులజితరిపులననె
విను ॥రామా॥

మేరుమందరహిమవత్పారియాత్రాదిగిరులఁ జేరియుండెడి వీ రులు, దేవాంశభవులు-భూరిశైలాకారులు, రణోదారులు, సారకరి బలులు, దశశతసహస్రాయుతులువి - స్తారవారణసత్త్వులునిస్తులులు చారుసౌవర్ణతనులమలశ-రీరులగణింగులు వినీలా, కారులిదెగర్జలిడి పరువిడ కడ,గినపనికి ప్రాణములీ, గోరినారిఁకవీరు మీయాజ్ఞావశు లభిజ్ఞాయనులు ॥రామా।

గొనకొనిభల్లూక,కోట్లుగొల్వఁగఁదగునీ-గుణనిధిజాంబవంతుఁ,
బలితుఁ డుపవన - తనయుఁడు హనుమంతుఁడు, నలనీలతార - పనస
గజగవయగ, వాక్షగంధమా - దనసుషేణదధిముఖులు కేసరి ప్రము
ఖులు - వినుమితఁడు శతబలిదశరథుఁడితఁ డనఘ వాలికొడు కంగదుఁ
డితఁ-డనుపమానబలాఢ్యులనువని గొనుమపన, వినతనయు నాలిం-
గనముచేసి సమోదాశ్రులోచనుఁడయి హరిబలికె ఘనుఁడయి
॥రామా॥ 2

ధరణిజ వెదకవా, నరులం బంపుమనీ, వెలుఁగవా కార్యసరణి
యనిపలికిన దా-శరథియానతిఁ దరణిసుతుఁడగ, చరుల-హరిదంతముల
కనిచెనవనిజ నడి నెలలో వెతఁగింపకున్న వారిద్రుంతునని భేరి - మొర
యించి యంగదజాంబవ ద్వినుతహనుమన్నలను షేణుల - శరభ
మైందద్వివిదులనని చె, నరసదక్షిణదిశకనిలజుని, హరిబిలిచిముద్రికసీత
కొసఁ గుమనియొసఁగెఁ జొసఁగ ॥రామా॥ 3

శ్రీరాముని చేనా, శీర్వాదములుగాంచి, మారుతిముఖ్యులరిగి - గిరి
సరిత్కుంజభూధరదుర్గములిరిగి, విధ్యాటవి - నీరుపట్టునడస్సి నీర
పత్తులుగు, హద్వారము వెడలి రాగాఁగ నిబిలములోగా-వా రేగిసింహా
సనస్థలి, వరనియతినున్న యోగినిగని -కోరి మ్రొక్కనవిరా రెవరనుచుఁ
దెలియదుగ - గారామదూతలమన వారిఫలములు గొనఁగ సెల
విచ్చె నతిమదినిహెచ్చె ॥రామా॥

జలఫలతృప్తులై, లలననీవెవరనిన- నలకాశ్వకర్మతనయను హేమ
యందురనను - తొలుతనాట్యమునంద్రి, నయను మెప్పించిన - లలిత
సద్వస్తుని, స్తులమానీపురమిచ్చె - నలి కాత్ముఁ డది మొదలీగతినుందు
పొదలి యలఘుమతులార యనివారల, ననిచి తాఁబోయి శేషాచల -
నిలయుడగు రఘునరపదాంబుజ, ములకెఱగి శ్రుతిసూక్తినతి నుతి-
నలిపి చెలిబదరి, కాశ్రమమునను గైవల్య మొందెను ॥రామా॥ 5

## 8 గౌరీరాగము—ఆదితాళము

పల్లవి—ఇందిరారమణుచరితమువినవే, సుందరీమణి॥

అను—మందయానమునఁ జనికపులుమ్రాని-క్రిందతనాసీనులై తెట్టు
బోదము - ఎందరయుదముసీతననినవాలి - నందనుఁడను జన
కాత్మజనుగన్గొనక - యందరిగిలిమేనిననుజంపు, ముందుగార
మాజానినే - నిందుమృతినొందువాఁడననందు, కొండతిండె
యుండ మెందుకుమృతియనిరి ॥ఇంది॥

రామబాణమునక భేద్యముజగ, త్త్రయమునందు, గలదాచిఱు
తయిట్లను - ఏమి తెలివివలదా, గుహానుండమను సోమరులనుడివి
నకు రాఘువునకు - సౌమిత్రికన్న సీమీాదప్రేమ, చాలగలదింకొక
రహస్యము - రాముఁడనఁగ నారాయణుఁడుసీత, శ్రీమహాలక్ష్మి
లక్ష్మణుఁ డాదిశేషుఁడు - స్వామిపార్షదులముమనము, వైకుంఠనివా
సులము హరి - భూమి భరముమాన్పదాశరథియై, పుట్టెననిదెలిపె
సంగదునకుఁ బావని ॥ఇంది॥

మునముమరామకార్యనిర్మాహకుల,మయినశుభముగలుగునని
సందరీ-ఘనునిబుద్ధి మెలఁగుటే మేలనిచన, చనిమహేంద్రచలమెక్కి
తగుచరుల్-ఘనమకరకమత, కర్కటజలూక - ఫణితిమితిమింగిలాది
జలచరా, భంగమై తరంగాలింగిత స్వర్గంగా - మనోజాంగవల్లియై
తనరు, వనధిఁజూచిభీతిల్లియుది - మనముదాఁటుటేడ రావణుఁడేడ,
ననుచు బ్రయోపవేశపరులై రపుడు॥ఇంది॥ 2

గిరిగుహావెలువడి సంపాతియనుఖగేంద్రుఁడు వానరులఁగని
భూరిగొందు-నిరతముఁదిందుకరులవలెనున్నారని- పరువిడిరాదుర్మృతి
భీతిప్లవగుల్ హరి- హరిజటాయువెంతసుకృతియైమరణమొందెననవా
సంపాతిసహో - దరునిమృతిదెలియవిని హరి, వరులచ్చటికివచ్చు

టయు నెఱింగివారును జలధికి రా - నరిగితమ్మునకు దిలోదకము లిడి మరలునతనిసీత, నడియుడిగిరగ చరు ॥ఇంది॥

నగశిఖర మెక్కి-నిక్కి-లంకలో, నశోకవని నవసీనుతిగంటినిదె మొగమాటముగాదనిపల్కి-సంపాతి, తగనిట్లనునాతమ్మునిజంపిన-పగ కీర రావణుని ద్రుంతు, పక్షయుగము లేకునికి నెగర లేనుచిన్నవాడో మహాత్ములార, పంతముమీఱఁగ - నీగిజటాయునేను రవిమండ,లో న్నంత బెగురగాను అరు ణగభ స్తిదీప్తిచే రెక్కలవిసి, పొగరడఁగి పడిరినతఁడు పడుటెఱుఁగనని ॥ఇంది॥

ప్రాణములు మూఁడుదినములకువచ్చి పరగ శేషశైల,వాసుని దయ-నేను దెలివొందిచాలావగసోముఁడన్ - మానిఁజేరజని ప్రొమొ క్కనఁగనిసంపాతి నీకీవిరూపమెటువచ్చె- మేనుగృశించు టేమనినజగతి లో మీరెఱుఁగని దేమి సంయమిస్వామి యైన వినుమని మదీయచే ష్టిత, మంతయుఁ దెలుపవినికడ _ లేనియడ లూనియున్న నన్నూర, డించ మునిదలచెననెఁ గపులను ఖగపతి ॥యింది॥

9 పూగరాగము—అదితాళము

పల్లవి—వినవె రామచరిత్రము, దాక్షాయణీ వినవె॥

అను—మునిచంద్రుడౌ చంద్రముఁడు, తన దెల్పురీతిసంపాతి - యని యెఁ గపులతో శోకమూలమిా, తనువు తనుకారణము కర్వ మనుచు॥

నేను దేహీ నను బుద్ధి, చేత పురుషుని కర్మమును అహమవి ద్యవల్ల-నౌను కాఁగినయినుమువలెఁ దాను, మాయాయుతుఁడై వెలిలోనుగుణమయుమైయిా, మేను నేననిభ్రమసి- తేను తెలివిమట్టై,

నం, దాన సంసారమాయా తానా అవి కారిదురభి - మానముగ
ర్మములు జేసి ఫలా, ధీనుఁడగుచుఁ జెడితిరుగుజీవుఁడనె ॥వినవె॥

యాగాదులు జేసినస్వర్గ, భోగమొందియా ఫలము-భోగాభవి
మైఁబడినరుఁడు బాగాచతుర్విధ భోజనస - రాగ స్త్రీపురుష సం
యోగమున రేతోమయుఁడై వేగమె స్త్రీగర్భము, లోగాఁ జొచ్చి
నెత్తుటఁ - దోగియొక నాటకలల, వైగట్టియైదు నా - ళ్ళఁగ బుగ
వలెనై పదియవదినము, రాగమాంసపేశియానని తెలిపె ॥వినవె॥

పదియేనహములకామాంసపు, పొదినెత్తుట జొత్తిల్లు నంక
దనై యంకురమిరువైయై, దుదినమ్ముల కుప్పతిల్లునెల - మొదలు
తలమెడ, మూఁపువీఁపు మదరమవియైదుబొడముకర- పదపార్శ్వకటి
జానూరువులుదునైయొసఁగురెన్నెలలా ముదిత గర్భిణికోర్కె, విదిత
మౌమూఁడవ నెలను - పొదలనంగసంధులఖిలాంగుళము, లుదయమౌ
నాల్గునెలలకని పలికె ॥వినవె॥

తెలిగన్నులుముక్కుఁ జెవులు, దిన్నెలచాలు నఖములై
దవ- నెలగల్గునాఱవనెలనుగర్ణ, బిలగుహ్య గుదములు పొ - క్కిలి
యొదవు రోమ, ములును బెన్నెరులందముగను - మొలచు నాఱున
నొక్కటా, నెలను ఎనిమిదవ నెలను - లలితావయ వోజ్జ్వలమాన,
స్ఖలితజానియై జీవుఁ డలరిమాతృభుక్తసారమైదవ, నెలమొదల్సచేత
నుఁడైఁ కొనుసనె ॥వినవె॥

నానాయోనులజన్మించి, నేనాలుబిడ్డలకై - హీనవృత్తికి
జొచ్చి యైనాకుటుంబభరణమం - దేనామదినిల్చేఁ గలనో, నైనా
హరినిదలఁచనైతి - గాన ననుభవించె, నీనారీ గర్భనరకము - నేను
తొలగిన మఱచిపోను హరినని శిశువుమేను కదలి వెడలు మాతృ
గర్భము - లోనుండి పదోనెలహరిదయనని ॥వినవె॥

తానుబ్రహ్మానందాద్వయ, ఘనతత్త్వబోధాత్ముగా-దనులో
త్రేగినయజ్ఞాన, జనితఘనమోహమడఁగును- వినతాపాత్రామదినిది
క్షణ గొనితాలిమిజెందుమనె మాని- యని శాఖగపతివానరులఁ, గని
శ్రద్ధయుబ్రెమొక్కి తెక్కలనువారవచ్చె శేషా, ద్రినివాసునిదలఁచిన
గ్రక్కనభవాబ్ధిఖిలుఁడయిన దాఁటుభక్తులగుమీకీ వనధియెంతని
వినవె॥ 6

10 ముఘురిరాగము - అటతాళము

పల్లవి—కోరిశ్రీ గౌరిభవ్యచరిత్రము ॥వినవే॥

అను—వారినిధివానరముఖ్యులు, చేరిదాఁటుదారిగానక-వారలోక
రోకరిమొగములు, సారెకుఁజూచుకొనుచుదైన్యముదేరనున్న
వనౌకసులఁగని, తారకొమరుఁడుబలికెనలవేర్పడగ ॥కోరి॥

కడలియిందెవ్వడు, గడపిసీతనుగనిరా, గలవాడు మాకెల్ల-
గడుప్రాణబంధుడే, ఘనుఁడెరతుకుఁడు రాఘవసుగ్రీవున కెలమిజెల్ల-
నెడవుపలదు మీమీబలములు, నుడుపుడనవుడు మోదమునగపు-
లుడుగకపదిమొదలు దొంబది, యోజనములదనుక మేమీ - జడధి
దాటగగలమనినవిని, జాంబవంతుఁడు యువరాజుతోబలికె ॥కోరి: 1

మునుత్రివిక్రమదే, వునకు ముయ్యేడుమా, ర్లొనర-బ్రదక్షిణ
ములు-నొనరించినానిప్పు డోదవె వార్ధకముదాటను జాలశతయోజ
నములు-అనినవాలితనయుఁ, డంబుధిదాటి చనిరాఁగలనో రాలేనో
యనెను-అనఘనిను బొమ్మనఁదగునేమమ్మంపఁ దగుదీవురాజ-వని
ఋక్షపతి పలికె నంగదుఁ, డంతఁ బ్రాయోపవేశము సుఖమను
కోరి॥

బలవంతుహనుమంతుఁ బ్రస్తుతింత మితడు, గలుగఁ జింత
సేటికిఁ-జలధిదాటియాజానికినిజూచిరా, గలడనిడాని ముమ్మాటి
దెలిసినిన్నెన్న, దరమేమముగా వలసిసౌమ్మనిలతనయ, సవ
డె-చెలఁగితోడగు నీకనుచునా, శీర్వాదములొనసిజేసి యుఁరిం
బ్రహ్మపుత్రునిగని, యాంజనేయుఁడు త్రివిక్రమువలె బ్రబలె ॥కో

మారుతిబ్రహ్మాండమగలనార్చిపలికె, నీరధియుత్తరించి-ఆరా
వణునిఁ ద్రుంచి, యుపనిదిదెత్తునో, ధీరులార మేలెంచి-ఆరాఘ.సహ
గట్టిలంకతో, నేరాముని సన్నిధికిఁ దెత్తునోత్వరగాఁ - జేరి త్రిజగ
న్మాతరైన, సీతనుజూచి రావోయనవుడు - పౌరుషముమీాద నగుచు
వనిజఁ, బరికించిరమ్మనిరికపు లందఱును ॥కోరి॥

తుహినాద్రిసముఁడత్య, ద్భుతస్వర్ణ వర్ణుఁడు మహితా రుణా
నుఁడు - అహికులసార్వభౌ, మాభదీర్ఘవాలుఁ డనుపమసుయశో
శాలుడు-అహితాంతకుఁడౌ, హనుమంతుఁడొప్పినా, మహేంద్రా
చలమస్తకమునఁజూడ - రహిమీాఱశ్రీమద ధ్యాత్మరామాయణ
మున కిష్కింధకాండము - బహుళార్థము తెలిగించెసు, బ్రహ్మణ్య
కవిశేషగిరిపతిపేర ॥కోరి॥

కిష్కింధాకాండము సంపూర్ణము.



# శ్రీమదధ్యాత్మ రామాయణ కీర్తనలు

## సుందర కాండము

### 1 సౌరాష్ట్ర రాగము—ఆదితాళము

పల్లవి—శ్రీరజతాద్రిసదనా వేడుకాశే, షాద్రీశుచరిత్రవిన విన॥

అను—మారుతిసాగరము, శతయోజన, దూరమొకనిబ్బరమున దాఁ
టఁగఁ - గోరియానందకందళితుఁడయి, శ్రీరామునిభజియింప
కపులఁగాంచి - కూరిమివనచరులారా, కనుఁ గొనుఁడీనన్ను
లంకఁజేర - భూరివేగమునఁ జనిజానికిఁగని, పొసఁగవత్తు
యశము దెత్తుమీకనియెను ॥శ్రీర॥

నేను ధన్యుఁడను ధన్యుఁడహరిపద, నీరజముల మరలఁగందు
నెవ్వడై నామృతికాలమందు, రాముని శ్రీనామస్మరణనొందుభవాం-
భోనిధిఁబుడిసిటియందు, నడచి, మానితముగఁ బరమపదమాఘనుఁడు
తానొందుశ్రీజానిదూత నతనిముద్రిక చేఁ, బూనితి రఘుపతిని నెమ్మ
దిలో ధ్యానించువనువోయీజడధి, దాఁటెదనని హనుమంతుఁ, డరి
కృతాంతుఁడు-పూని బాహువులుజాఁచి మెడపొడవుగనిక్కించిమీదు
జూచి- యేనువంచి తోఁకఁబెంచి పాదములూని యెగసెవాని పొగ
రేమిచెప్పుదు ॥శ్రీర॥

పోవుచున్న పవనాత్మజుబలమును, రావళిఁజూడఁదలంచిసురసా-
దేవికి నుపదేశించిపంపిన, పావననదిరొదిరించిపెరిగిన - నావీరుఁడు

